





*Consulting Physician :—*

ఆయుర్వేదభూషణ వేటూరి శంకరశాస్త్రిగారు, ఎ. ఎం. ఎ. సి.

## నరములకు పట్టు
## కండరములకు బలము



యివి రెండును మానవజీవనమును సౌఖ్యవంతముగ ఉపయుక్తముగ చేయగలవు. వీటిని ఆధునికదినములలో పెంపొందించుకొనుటకు జీవామృతమే సాధనము. జీవామృతము నరములకు పట్టును; కండరములకు బలమును సత్తువను ప్రసాదింపగలదు. జీవామృతసేవనము జీవితోత్సాహము నిచ్చును.

నరముల పటుత్వమునకు, కండరముల బలమునకు

# జీవామృతము

---



తొట్టిలోని పాప యెప్పుడూ

## ఆడుకోవాలి, గాని
## యేడ్వకూడదు

బాలపాపల ఆరోగ్యము యకృత్ ప్లీహోదరములయొక్క స్థితిమీద ఆధారపడివుంటుంది. అది పెరుగకుండ ప్రకోపించకుండ వున్నంతవరకు పసిపాపలు యేడ్వకుండ ఆడుకొంటూవుంటారు. ఏనాడా అవయవములు యేదో ఒక కారణమున పెరిగెనా ఆ పాపల జీవితము యీడురోమంటూవుంటుంది. బాలపాపలను యీ ప్రాణములుతీసే బల్ల, గడ్డలనుండి రక్షించవలెనంటే అందుకు బాలభాస్కరయే సాధనము.

బాలభాస్కరసేవనమువలన యకృత్ ప్లీహోదరవ్యాధి పటాపంచలుకాగలదు.

# బాలభాస్కర

ఆయుర్వేదాశ్రమం. గోవిందప్పనాయకవీధి, జి. టి. మదరాసు.

# ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్ర మాసపత్రిక.



స్థాపితము ౧౯౩౩.
సాలుచందా 1-8-0.
సంపాదకుడు :
ఆండ్ర శేషగిరిరావు, బి.ఏ.

సంపుటం : ౫. ఈశ్వర, వైశాఖము : మే, 1937. సంచిక : ౧౦.


## మన భాష, మన పత్రికలు

'భాషావ్యాధికి చికిత్సకావాలంటే...'


రచయిత :

బొడ్డు బాపిరాజు


భాష అంటే తనమనస్సులోవున్న భావాన్ని తోడి మానవునికి వెల్లడించేటందుకున్న ఒక సాధనము. అతి విస్తృతమైనభాష అనేకమంది వుచ్చారణలలో పడి నలిగి రూపుచెడకుండావుండే అందుకు పెద్దలు దీనికి కొన్ని కట్టళ్లు కల్పించారు. లోకం యెన్నడూ ఆకట్టళ్లు పాలించివుండదు. కాని, గ్రంథాలందుకు చేతులుజోడించిక తప్పలేదు. లోకం పరివర్తనం చెందడం నిత్యం అంచుకని దానికి నియమాలు అడ్డురావు. గ్రంథాలే; నియమాలు పాటించకపోతే వాటి ప్రయోజనం నిర్వర్తించలేవు. కొంతకాలానికి అవి అర్థంలేనివికాగలవు. భారతరచనాకాలంలో వాడుకలోవున్న మాటలుచాలా అందులో కన్పిస్తాయి. నేటి మన లౌకికానికి అవి చాలా దూరమగుటచే వింత ప్రయోగాలనిపిస్తాయి. కాని కవి కావ్యాల్లో అప్పటి సమయం ప్రతిబింబిస్తూనేవుంటుంది. ప్రకృతం వ్యవహారిక గ్రాంథికాలకుండే తారతమ్యం జోలి మనకక్కరలేదు. కాలాన్ని కర్చుపెట్టుకొనే వాళ్లా పనికి చాలామంది వున్నారు. ఆచారాలు, అందచందాలు విభిన్నమైనట్లే ఆయాప్రాంతీయులకు ప్రత్యేకభాషలుంటాయి. మనది తెలుగుభాష. 'దేశభాషలలో తెలుగులెస్స' అన్న ప్రతిష్ఠ మనకేడక్కింది. తెలుగునుడిలో వున్న మెత్తదనము, తెలుగు పలుకులో వున్న తీపి ఋజువుచేయడానికన్నట్టు విడిచిపెట్టకుండా నేటికీ అరవసోదరులు కన్నడ భ్రాతలు మన త్యాగయ్య తల్లిపలుకులలో వాణిని పునీతం చేసుకొంటూ వున్నారు. మనలో తెలుగంటే తెలియనివాళ్ళుకూడావున్నాం తెనుగంటే నాటకం పేపర్లు వల్లించడం చాకిరేవుపద్దులు వ్రాయడం మాత్రం అనుకొనే తెనుగుబిడ్డలూ వున్నారు, సుమతీ శతకంలోని ఒక పద్యానికైనా అర్థం తెలియనివాడు కూడా తెలుగువచ్చినవాళ్ళలో జమే. అటువంటివారి దృష్టిలో నిత్యం మాట్లాడుకోవడంకంటే తెలుగు భాషకు యిక రూపంలేదు.

పుస్తకాలలోకంటే పల్లెపడుచుల కమ్మని కంఠాల్లో గూడుకట్టుకొన్న పాటలలో తెనుగునుడి తేటదనం పసిపట్టవచ్చును. ఏలపాటలలో రస సముద్రాలు కనిపిస్తాయి. నాగరికతా ప్రపంచం విననోచుకోని దంపుళ్ళ పాటలలో తెనుగులోవున్న

లాలిత్యం వెల్లడవుతుంది. కవిబ్రహ్మనోట పొందు కొన్న ఆ తెలుగునుడికారం హాయల్ యింకెవరి సొమ్ము కాదంటే అబద్ధంకాదు. ఇంతకు చెప్ప వచ్చేది 'తెనుగు తేటతెల్లమైన' దని.

కవిత్వం : భాషను కొన్ని నియమాలకు లోబరిస్తే పద్యాలు తయారవుతాయి. నడకలోవున్న ఒక ప్రసన్నత చెవికి యింపుగూర్చే ఒకసంగీతమువలనా గద్యంకంటే పద్యానికి గిరాకీఎక్కువ. అది కవిచేసే పని గనుక కవిత్వమన్నారు. కవిత్వమంటే వృత్తి పద్యాలే కాదు రసమయమైనది ఒక్క వాక్యమైనా కవిత్వమే అని తత్వజ్ఞులైనవారు నిర్వచించారు. కవిత్వం కీర్తి, లోకవ్యవహారం, యిత్యాదులకొరకని పెద్దలే తేల్చారు. ఇంచుమించు అప్పటికీ యిప్పటికీ కవిత్వం అందుకే అని అన్వయించుకోవడంలో పొరపాటు లేదు. మన తెలుగుకవిత్వం ప్రభ పురాణయుగంలో కంటె ప్రబంధయుగంలో బాగా వెలిగింది. ఇప్పటి మన వూహలకుకూడా అందుబాటుకానంత వైభవం వెళ్ళబోసింది. అప్పట్లో కవిత్వంఅంటే రాజులకూ అంతకంటే ప్రజలకూ ఆదరాభిమానాలు వుండేవి. కృష్ణదేవరాయల కాలంలో తెనుగు కవిత్వానికి పదహారుకళలు నిండాయి. అప్పటినుంచి భాషకు బహుళ పక్షం ప్రారభమైంది. ఆ కాలంలో విచ్చిన కావ్యకుసుమాలు నేటికీ పరిమళము చెడలేదు. సొగసు తగ్గలేదు. కవులకవి అదృష్టప్రదినాలు. గంటం పట్టినవానియింటిలో గజ్జకట్టి లక్ష్మి తాండవించేది. తెనుగుభాషకు కనకాభిషేకంచేసిన పండితరాజులు, కృతినందుటకు పల్లకీమోయ దొరకొన్న కవిరాజులు పరిపాలించిన రోజులవి. కృతి రచించడానికి రమణీ ప్రియదూతిక తెచ్చియందిచ్చే కప్పురపువిడెము. బంగరు తూగుటుయ్యేల మంచము. ఒప్పుతప్పు యెరిగించే రసజ్ఞులు. వూహ తెలియగలిగిన లేఖకులు అవసరంపడిన రోజులవి. అప్పటి కవులధికారాన్ని ఆలాగే చలాయించుకున్నారు కూడా. ఆరాజులతో పాటు కవులూ యశశ్శరీరులైనారు. ఆరోజులూ కాల ప్రవాహంలో కొట్టుకుపోయినవి. అప్పటి భోగమూ తారుమారయింది. నేడు కవిత్వాన్ని ఆదరించే ప్రభువులమాట అటుంచగా, అభిమానించే ప్రజలే కరవయ్యారు. సాంఘికంగా ఆర్థికంగా జరిగిన మార్పులతోపాటు సారస్వతంలోకూడా మార్పులూ పరివర్తనం చెందాయి. పూర్వ కవిత్వానికి ఆధునికకవిత్వానికి అంతరాలేర్పడ్డాయి. సారస్వత ప్రియులలో పూర్వ సాంప్రదాయముగ్ధులు కొందరు. నేటి భావ కవిత్వరసికులు కొందరు. రెండు తెగలుగా చీలిపోయారు. మధ్యవర్తులంగా నిలిచి పరిశీలిస్తే రెండు కక్షలలో సత్యాంశమూవుంది, లోపమూ వుంది. అప్పటిలోకొన్ని మెప్పించడానికి చేసిన ప్రయత్నం వారి గ్రంధాలలో ప్రతిఫలించింది. ఇప్పటివారమైన మనకు అసభ్యమనిపించే అంగప్రత్యంగ వర్ణనలతో అప్పటి కావ్యాలు అల్లుకుపోయివున్నవి. ఆత్మసౌందర్యాన్ని ముద్రించే రంగు లప్పటి కుంచెలలో లేవనే చెప్పవచ్చు. ఎంతవరకు అంగసౌష్టవం మీదే కన్నువేశారు. ఆ కాలంలో వెలువడ్డ కళాపూర్ణోదయం వినా వస్తుకల్పనలోకూడా ఒకదానికొకటి నకలే. అనవసరంగా వర్ణనలు ప్రవేశపెట్టి కథావేగాన్ని నిరోధించడంలో ఒకరికొకరు తీసిపోలేదు. ఋతువర్ణనలు, విప్రలంభ శృంగారము విసుగుపుట్టించేమాట నిజం! సూర్యోదయాస్తమానాలు ప్రతికావ్యంలో ప్రత్యక్షమౌతాయి. ఒక కావ్యంలోని విరహవతి అయిన నాయికనూ, ఆవిడచేసే వుపాలంభాలనూ చూస్తే వింటే మిగిలిన నాయికలావిడ అప్పాచెల్లెళ్ళలావుంటారు. ఇంతకు అప్పటి రాజుల కవి పసందయేవి. ప్రజలకవి నచ్చేవి. నేడు ఆపాత త్రోవలు మూయించివేశారు. క్రొత్త రస్తాలు నిర్మించారు. నేటి కవుల రచనలలో ప్రేమ తరచుగా ప్రవేశిస్తూవుంటుంది. చాలామందికి కావ్యాలల్లించే ప్రేయసులున్నారు. ఇందులోనూ అనుకరణంలేక పోలేదు. కాని, అనుభూతికి అందిన విషయాలు చిత్రించుకోవడంలో యీకాలానికే ఎక్కువ చెల్లుబడివుంది. శతాధికాలైన ఖండకావ్యాలందుకు నిదర్శనాలు కాగలవు. ప్రకృతి నారాధించడంలో

పలుకు విలువ హెచ్చింది. ఇప్పటి కావ్యాలలో నవ్యత లేకపోలేదు. కాని, పాండిత్యంలో అపసవ్యం వుంది. పూర్వపు విరహవేదనలు వుపశమిల్లాయి. కాని, ప్రేమగీతాలు పెచ్చుపెరిగాయి. కవులలో నాటికీ నేటికీ కావలసినంత అంతరంవుంది. అప్పటి కవులు బాధ్యతతో కూడిన రచనలు వెలువరించేవారు. లోకానికికంటే శాస్త్రానికి తలవంచేవారు. ఏమాత్రం కట్టడితప్పినా అప్పటి లాక్షణికులు సహించేవారుకారు. భాగవతం అంతటిదాన్ని అప్పకవి తిరస్కరించాడంటే అందులోవున్న స్వతంత్రప్రయోగాలే కారణం. సర్వలక్షణ సమన్వితమైన దానికే అప్పట్లో రాజసభాప్రవేశమూ గౌరవమూ వుండేవి. అందుకనే అప్పటి కావ్యానికంత విలువహెచ్చింది. ఇప్పటి కవులలో పూచీపడనిరచన మెండయింది. ఆ నాటికవులకున్న సర్వతోముఖపాండిత్యప్రకర్ష నేటివారిలో లోపించింది. అది నిజానికి తీరని లోపమే! నవ్యత నాపాదించుకోవడానికి వ్యాకరణాది నియామకాలు వుల్లంఘింపవలసివచ్చింది. ఈ చేసిందంతా రససిద్ధికొరకు భావదీప్తికోసం అంటే వొప్పుకోరాని విషయం. ప్రాతకావ్యములలో రసంచిందడంలేదనడం సాహసం. ఎన్ని చెప్పినా ఆకాలంవేరు, యీకాలంవేరు. కాలంలోవున్న దామార్పు. అప్పటివారు చేసినవన్నీ స్థిరమైనరచనలు. నేడు అల్పప్రయోజనంగల పత్రికల ఆలంబనంతో వెలువడే యీ రచనలకు స్థిరత్వంలేగు. రచనలందేకాదు అప్పటిపల్లె యిప్పటివారికి ఒక సమగ్రమైన గ్రంథ నిర్మాణంకూడా కష్టమే. గ్రంథాలువ్రాసే పెద్దలు లేరనికాదు నా తలపు. ప్రత్యేక ఖండకావ్యాలతో పత్రికలమోజు తీర్చుకొనే యువకుల మాటే నేను చెప్పింది. ఖండకావ్యాలలోకూడా రసంపుట్టించవచ్చుకాని సమగ్రమైన కావ్యంకలిగించిన రసానుభవం యీచిన్నిఖండిక కలిగింపలేదని సందేహించడానికివీలుంది రసమైనది ఒక వాక్యమైనా కవిత్వమే అన్నప్పుడు తప్పక వీటిని మెచ్చుకోవలసేవుంటుంది.

శ్రీనాథుడు దుమ్మెత్తిపోసిన పదకవితకు నేడు పట్టంకట్టారు. నేటి యువకులలో కమ్మని గేయాలు వ్రాసేవాళ్లు చాలామందివున్నారు. ఆధునిక కవిత్వానికి అర్థాలులేవు అన్వయాలు కుదరవనే అపవాదు కలిగించిన ఏకొలదిమంది రచనలో మినహాయిస్తే ఆ మాటకు విలువలేదు అనగలం. ఆరచన లట్లావుండడానికి హేతువు భావాన్ని పదాలలో బంధించే సామర్థ్యం లేకపోవడమే. అనవచ్చును. పూర్వం కవులు అపురూపంగా వుండేవారు. నేడు సంఖ్య పెరిగింది. సంతోషమే! కాని, వున్నవిలువమట్టుకు తగ్గింది. కృతులకోసం కాళ్ళావేళ్ళాబడే రాజులకు క్షామంవచ్చింది. కవుల గ్రంథాలొకటేనా డబ్బిచ్చికొనే పుణ్యాత్ముడు తెలుగుజగత్తులోలేడు. కవిగ్రంథాలు నేడు అతని యింటిని సకుచితం చేయడానికే వుపకరిస్తున్నాయి.

ప్రస్తుతం ప్రచండగా పత్రికలు పెరిగినట్లే వాటిమీద కలవరంకూడా పెచ్చుపెరుగుతూనేవుంది. తెనుగుదేశంలో యిన్ని పత్రికలు పుట్టగలిగినవంటే గొప్ప విషయమే. అందరమూ అందుకు సంతోషించవలసిందే. ఎన్నడూ పత్రికఅంటే తెలియని వింత వ్యక్తిచేతిలోనూ ఏ నవ్వులరాణో పరిమళిస్తూనేవుంది రాజమండ్రినుండి కనీసం ఏలూరుకు ప్రయాణం కలిగిందంటే ఒక పత్రిక కర్చుపడ్డదన్నమాటే. ఈవిధంగానైనా తెలుగుమీద అభిరుచి అలవడితే అదేచాలు. కాని, నేటి పత్రికలు చాలా హైన్యస్థితిలో వున్నాయి. పత్రికలు దినదినాభివృద్ధి చెందుతూవున్నట్లే వ్రాసేవాళ్లుకూడా పెరిగారు. వ్రాసినదల్లా అచ్చవుతూవుంది. యింకా కావలసిందేమిటి? రచనలో పద్ధతిలేదు. భాషలో నిలకడలేదు. పత్రికలకు విలువలేదు. వ్రాతలలో బరువులేదు. మనం కొంతకాలం ముందుకుపోయి అప్పటిదృష్టిలో చూడగలిగితే యిప్పటికాలాన్ని అసహ్యించుకుంటాం. ప్రబంధకాలం యిప్పుడు మనదృష్టిలో యెలావుందో యీకాలంకూడా మనతరువాతి వారికలానేవుంటుంది. ఆర్థికంగా పత్రికాధిపతులకు లాభంవున్నా నైతికంగా లోకానికిమాత్రం చాలా కీడువుంది. మానవుల హృ

దయ దౌర్బల్యాన్ని చిత్రణంచేసే యీ నేటి కథా సారస్వతం పూర్తిగా ధ్వంసంకావాలి. ఉన్నత పథానికి నడిపిస్తూ ఆత్మవికాసంకలిగించే కథలు కావాలి. జగత్కల్యాణాన్ని అర్థించే రచనలుకావాలి. ఈ తప్పంతా ఒక్క పత్రికాధిపతులదే అనడానికి వీలులేదు. పత్రికలెంతవరకూ లోకాన్ని అనుసరిస్తూ వుంటాయి. లోకం అభిరుచిని గుర్తించలేకపోతే వాటికి బ్రతుకేలేదు. అందుకనే లోకులకు నచ్చేవిధానమే అవలంబింపబడుతుంది. ప్రజాసమూహంయొక్క ఆదరాభిమానాలు నేటి పత్రికలకున్నాయి అంటే ప్రజలకు నేటి పత్రికాసారస్వతం రుచించిందనుకోవాలి. అసభ్యమైన రచనల కామోదం లోకం యిస్తూవుంటే. పత్రికలెందుకు మానాతాయి? పత్రికలు ప్రేరేపిస్తూవుంటే వ్రాయసగాళ్లుమాత్రం ఎందుకు జంకుతారు? తప్పంతా ఎవరిదంటే లోకాం దన్నమాట. ముందు లోకాన్ని బాగుచేస్తే దాంతోపాటు మిగిలినవీ బాగుపడ్డట్టే లోకంఅంటే మనమే. ఈవిషయంలో దోషంకొంత పెద్దలమీదకూడా మోపవలసి వుంటుంది. కారణం: సామర్థ్యంవుండికూడా మంచిరచనలు చేసి ఆదర్శంగా చూపుతూ యిటువంటి వెల్లువను అరికట్టడానికి ప్రయత్నించకపోవడమే. వృద్ధిపొందుతూవున్న ఒక చెడుగును నిందిస్తూ దానిమీదదుమ్మెత్తిపోసేకంటే పూనుకొని ఆ చెడుగును ప్రతిఘటించడం సరియైనపని. అప్పటికిగాని హాస్యం మరుగున వెలువడే యీ బూతులబుంగ పగిలిపోదు. ఎంత సత్యమైనప్పటికీ నగ్నంగా చిత్రణంచేసే అసభ్యాచారం అడుగంటదు. రోజుకు రోజుకు పెరుగుతూవున్న పత్రికల కొక హద్దు ఒక విధానం ఏర్పడుతుంది. హద్దుమీరిన రచనల కప్పుడు వెలివేయవచ్చు. ప్రత్యేకవిషయాలమీద పుష్టిగా పత్రికలు వెలువడడానికి అనువులభిస్తుంది. అంత అదృష్టంపట్టాలంటే, మనసునిలకడలేని అబ్బాయిల్లోను సౌశీల్యమంటే యేమిటో తెలియని అమ్మాయిల్లోను. ప్రేమంటే అపార్థాలు చేసుకొంటూవున్న కవుల్లోనూ రోజుకు రోజుకు పెరిగిపోతూవున్న యీభాషావ్యాధికి చికిత్స చేయాలంటే లోకం, పత్రికలు, కవులు అనే యీ మూడు దిసులూ ముందు శుద్ధిచేయాలి. అప్పటికిగాని జబ్బు నయంకాదు. తిరిగి వసంతఋతువు ప్రారంభంకాదు. దేశకల్యాణం చివురుపట్టదు. ఆవసంతాగమంకోసం ప్రతి సారస్వతార్చకుడు కృషి చేయాలి. ఏనాటికైనా ప్రయత్నం వృథకాదు. తిరిగి భాషకు శుక్లపక్షం ప్రారంభంకాకనూపోదు.

ముగింపు : కారుక్రమ్మిన యీ అమావాస్య చీకటిలో వెలుగులు విరజిమ్మే నక్షత్రాలు లేకపోలేదు. ఈఅధ్వానపు అరణ్యంలో మనసు మురిపించే కమ్మని పూవులు లేకపోలేదు. అల్లకల్లోలమైన యీ సముద్రంలో సుధాకలశాలు లేకపోలేదు. చక్కగా పద్యాలువ్రాసే మధురకవులున్నారు. ఆనందంగా గేయా లాలపించే యువకవులున్నారు. జగత్కల్యాణాన్ని చిత్రించే కథాస్రష్టలున్నారు. లేకపోలేదు. అసలైంది ఆదరించే లోకమే కరవైంది. ప్రభువులకీ గొడవపట్టదు. అభిమానించేవారుంటే భాషకు అలంకారాలైన మేలికావ్యాలు తయారవుతాయి. ఆశుభక్షణంకోసమే అందరమూ భగవంతుని ప్రార్థించాలి.

[భీమవరమునందలి రవీంద్రసారస్వతసమాజము వారి హార్షికోత్సవ సందర్భోపన్యాసము.]



[illegible]

ఉ. ఓనవనీతకోమలవయోరుచిరాంగి! యనుగ్రహింపు ప్రే
మానుమితాస్మదీయవచనావళులన్ భవదార్ద్రరాగ స
న్మానితుఁడై నఁయీకవికుమారునిపల్కులు నీమనోజ్ఞ నే
త్రానుగతాచ్ఛశోభనము లందుకొనం దలతెత్తవేనియున్.

ఉ. చీకటిదారులందు వికసించిన వెన్నెలపోలె తీవ్రబా
ధాకులులైనవారలు సుధాసరసిన్ గొను స్నానమట్లుశ్యా
మాకృతిఁదాల్చి నాదుహృదయమ్మున నిల్చిన దివ్యరాజ్ఞి నా
కై కరుణించి నీతనువికాసము నింపుము నామనమ్మునన్.

ఉ, మోమున మోముజేర్చి నిను ముద్దిడు కోరిక లేదు నీదువ
క్షోమృదుశయ్యపైని శిరసున్ గెడవాలిచి ప్రేలు మల్లికా
దామసువాసనామధురత ల్పరికింపఁగఁ గాంక్ష లేదు; నా
ప్రేమకు దాలిజూపఁగ వరించితి నాయలరంచు నెచ్చెలీ!

ఉ, మ్లానమతిన్ దృగంచలములన్ దొలకాడెడు నీమనోజ్ఞతల్
లోననడంగు నశ్రువులఁబోఁ దడుపన్ దలపెట్టఁబోక వై
జ్ఞానికసాదుభాషణములం దనియింపుమునన్ను నీమదిన్
లీనవు కమ్ము; నన్గవుఁగలింపుము నీకమనీయశోభ చే.

'ఊహాగానము నుండి, —అబ్బూరి రామకృష్ణరావు, బి. ఏ.

---

## "బాపి బావ"

[బాపిరాజు కళోపాసి. ఆతడు శిల్పి అనుట ఆముఖవిన్యాసం తెల్పుతుంది. ప్రేమరూపం ఆకళ్ళలో మెఱుస్తూంటుంది. ఇద్దరు కలహించుచోట నిలువలేడు. అడివిలో పుట్టి పెఱిగిన చందన తఱువు—వరసా ప్రేమా ఏకమై బాపిబావ అయ్యాడు]

పండువెన్నెల పఱచీనట్లూ
మల్లెపూవులు నల్లీనట్లు
తేనెవాకలు దొర్లీనట్లేనోయ్
ఓ బాపి బావా
ప్రేమవాహిని పొంగిపొరిలేనోయ్॥

కుంచెచివరలు చిత్రాలోకాల్
గొంతులోతులు లయలూపాటలు
గానమంతా కలమూనుంటుందోయ్
ఓ బాపిబావా
గానమందే నృత్యామవుతావోయ్॥

నీటుగోటులు యెఱగారావూ
చాటుమాటలు చెప్పాలేవు
మాటపొందికమనసామెత్తనిదోయ్
ఓ బాపి బావా
అమృతమూర్తివి అందాలెరిగేవోయ్॥

పలుకుతీపులు భావం మెరుపులు
చిలకారించే చిత్రారీతులు
పిలుపులోనే కరిగిపోతావోయ్
ఓ బాపి బావా
తలపులోనే ఆడిపోతావోయ్॥

—అత్తిలి సూర్యనారాయణమూర్తి, (రవీంద్రసారస్వతసమాజము)

[ఈ గేయము శ్రీయుత అడవి బాపిరాజు గారినిగూర్చినది. బాపిరాజు కవి, చిత్రకారుడు, గాయకుడు, కళావేత్త వారితో చెలిమికలిగిన శ్రీసూర్యనారాయణ గారి ఈ గేయము సత్యమును ఆరాధించునది గానున్నది.]



# ఏనుగులు ఎగరగొట్టిన జయాలు

[భారతదేశయుద్ధముల జయాపజయము లొక్కొక్కప్పుడు ఏనుగులు నిర్ణయించిన ఘట్టములు.]

(గజలక్ష్మి భారతదేశీయులపాలిటి జ్యేష్టలక్ష్మికాని జయలక్ష్మికాదు.)

రచయిత:

కె. సత్యనారాయణ, బి. ఏ., బి. యల్.

అనాదినుండియు భారతీయ యుద్ధరంగమున చతురంగములలో గజబలమొక ముఖ్యాంశముగ నెన్నబడుచుండినది. మహాభారత యుద్ధానంతరము, రానురాను రథ, గజ, తురగ పదాతులలో రథబలము ప్రాముఖ్యత గోలుపోయి దేవాలయోత్సవముల నూరేగింపుల కలంకారముగ మాత్రము మిగిలినది. తదితర బలములలో ఆంగ్లేయ ప్రభుత్వము సుస్థిరమగువరకును హిందూదేశమున గజబలము మహమ్మదీయులచేతను, హైందవులచేతను గూడ విరివిగ వాడబడుచుండెను. కోటతలుపుల బేధించుసమయములందు గజములను మిక్కిలిగ వాడుచుండిరి. ప్రపంచమున మరేదేశమునను విరివిగ కానరాని ఈ గజములను యుద్ధపరికరములుగ వాడుట భారతీయుల ప్రత్యేకతయని నుడువవచ్చును. చారిత్రికయుగమునకు పూర్వమునను, చారిత్రికయుగమునను, విపరీతకాయములగు నీ గజములను గూర్చియు, యుద్ధరంగమున వాటి యుపయోగమునుగూర్చియు గ్రీకులు, రోమనులు మొదలగువారు కథలుగ చెప్పుకొనుచుండిరి.

అయితే మనము చారిత్రిక యుగమును పరిశీలించితిమేని యుద్ధమున ఏనుగలు మన మనుకొన్నంతగ సహాయకారులాయని సందేహముపొడమక మానదు. అన్నిటికన్న విచిత్రము అనేకసందిగ్ధసమయములందు ఒక్కొక్కయేనుగ తన చెయిదముచే భావిభారత చరిత్రనంతయు పరిపూర్ణముగ మార్చివేయుటయే. మన దేశచరిత్రలో అట్టి ఘటనల కొన్నిటినిట విచారింతము.

౧

మాసిడోనియా మొదలు నేటి ఆఫ్గనిస్థానమువరకుగల ప్రపంచభాగమును జయించి, అంతవరకు ప్రపంచము కనివినియెరుగని మహాసామ్రాజ్యమును స్థాపించిన అలెగ్జాండరు సార్వభౌముడు భారతదేశముపై గూడ దండెత్తి (హైడాస్‌పెస్) జీలమునదీ తీరమున విడిసెను. అతని నెదుర్కొనుటకు పురుషోత్తముడు ప్రబల సైన్యములగూర్చుకొని నదికివ్వల విడిసెను. పురుషోత్తముడు ఆజానుబాహుడు. సమున్నత శరీరుడు సుస్థిర శౌర్యధైర్యయుతుడు. కాయమున నెంత సమున్నతుడో భావమునగూడ నంత ఔన్నతిగలవాడు. అలెగ్జాండరు ఇంతవరకు ఇట్టి ప్రబల శత్రుని, ఇంతటి సుశిక్షిత సైన్యము నెదుర్కొనలేదు. ముఖ్యముగ హిందూసైన్యము

లోని నడగొండలవంటి ఏనుగులు యవనులకు భీతిగొల్పుచుండెను. నిజమునకు బహిరంగ శత్రువు నెదుర్కొనుటకు సార్వభౌముడే భయపడుచుండెను. జయాపజయములు భవిష్యద్గర్భములో దాగియుండెను. అట్టి స్థితిలో ఒకనాటిరాత్రి ప్రళయకాలమునబోలె మేఘగర్జనలు వినవచ్చెను. దట్టముగ మేఘములలముకొని అంధకారము ద్విగుణీకృతమయ్యెను. అట్టి గాఢాంధకారమున యవనులు హిందువులనేమరించి నదికి పదునారుమైళ్ళ ఎగువను ఒక వంపులో ఒక ద్వీపసహాయమున నదినిదాటి తెల్లవారుసరికి హిందువుల వెనుక భాగమున ఒక అనువగుచోట యుద్ధమునకు సిద్ధపడిరి. ఆస్థితిలో హిందువులకు అధిక సంఖ్యాకులమను ధైర్యమును, స్వస్థలమను విశ్వాసమును పట్టుగొమ్మలై యున్నవి. ఇరువాగులును తలపడిరి. పోరు ఘోరముగ జరుగుచున్నది. జయాపజయములు నిర్ణీతములుకాలేదు. అట్టి సమయమున హిందువులు తమకు దృఢబలమని నమ్ముచున్న గజములు, అశ్వములపై నెక్కి దాడిసల్పుచున్న విలుకాండ్ర ప్రబలధాటి కాగలేక వెనుదిరిగి స్వాధీనము తప్పి స్వసైన్యమునే నాశనముగావింప మొదలిడి పోరుచున్న హిందువుల చిందరవిందరగావించెను. జయలక్ష్మి యవనులనే వరించెను పురుషోత్తముడు గాయపడి పట్టువడెను. కాని అతనిఠీవికి ఔన్నత్యమునకు అలరి అలెగ్జాండరు అతనిరాజ్యము నతనికే కానుకగ నిచ్చివైచెను. హిందువుల జయమునకు, జయశ్రీలని తలంపబడుచుండిన గజములే అడ్డువచ్చెను. ఇది క్రీ.పూ. 327–వ సంవత్సరము నాటి కథ.

౨

పదుమూడు శతాబ్దుల వెనుక కాలచక్రము తిరిగివచ్చినదోయన అదేవిధమగు సంఘటన సంభవించినది. ఆకాలమున హిందూదేశముపై దండయాత్రలు సలుపుచు ప్రజల ధనప్రాణముల కొల్లగొనుచున్న గజినీమహమ్మదు నెదుర్కొన హిందువులు అదివరకు కనివిని యెరుగని ప్రచండసైన్యములగూర్చుకొని పెషావరువద్దవిడిసిరి. ఉజ్జయిని, గ్వాలియల్, కలింజార్, కనూజ్, ఢిల్లీ, అజ్మీర్ ప్రభువులు తమతమ సైన్యములతో నచట సిద్ధమైరి. లాహోరు ప్రభువగు ఆనందపాలునికి సైన్యాధిపత్య మొసంగిరి. హిందువులలో ఈసారి తురకల పారద్రోలగలమను నుత్సాహము పొంగి పొరలుచుండెను. ఆనాటి యుత్సాహ మెంత తీవ్రముగనున్నదన ప్రతి హైందవసతియు తనయాభరణముల కరగించి యుద్ధమునకు పోవుచున్న పతికొసంగినది. అతి బీదలుగూడ తమకున్న తృణమో పణమో యుద్ధసహాయార్థ మొసంగిరి. మహమ్మదీయులు నలుబదిదినములు వేచియుండిరి. దిన దినము హిందూసైన్యములు సింధునది వెల్లువలవలె పొంగుచునేయున్నది. 41–వ దినమున మహమ్మదు ఆరువేల విలుకాండ్రను శత్రుసేనపై దాడిసల్పబంపెను. కాని వారు హిందువులతోజేరి యుద్ధమునకు సిద్ధమైయున్న ఖోకారులను సిథియనుజాతి భీకరసైనికులచే తరిమివేయబడిరి. ఈసిథియనులు తలకుగాని కాలికిగాని ఏరక్షణయు ధరింపకయే ఈటెలను కత్తారులను గొని శత్రుబలముల దూరి ఎడమ కుడియనక మహమ్మదీయుల చిత్రవధ గావింపదొడగిరి. జయలక్ష్మి కనుచూపు మేరలో మాత్రమున్నది. కాని విధి జయమును హిందువులకని నిర్ణయించలేదు. ఈసారియు గజమే విధిచేతి సాధనమైనది. హైందవ నాయకుడగు ఆనందపాలు డారోహించియున్న

హస్తి హటాత్తుగ భయముగొని వెనుదిరిగి పరువెత్త మొదలిడెను. వెంటనే రాజు పారిపోవుచున్నాడని ఒకవార్త సైన్యమంతయు వ్యాపించి, సైన్యముగూడ వెనుదిరిగి పరుగిడ మొదలిడెను. ఒక్క క్షణమునకుముందు హిందువుల జేరవచ్చిన విజయలక్ష్మి ఇపుడు చంచలయై వారి కంటకారముజల్లి మహమ్మదును వరించెను. ఒక యూరోపియను చరిత్రకారుడు వ్రాసినట్లు తిరిగిచూడకుండ పారిపోవలసిన మహమ్మదు ఒక్క క్షణములో హిందువులను దరుము విజేతయయ్యెను. ఇది యంతయు ఒక్కే ఒక్క ఏనుగు స్వాధీనముతప్పి వెనుదిరుగుటచేత.

3

పై యుద్ధము మహమ్మదీయులు హిందూదేశమునకు పాలకులగుటకు పునాదియని చెప్పవచ్చును. అదే మహమ్మదీయుల పరిపాలనాంతక కారణమగు యుద్ధమునగూడ ఏనుగయే ప్రాధాన్యముపహించెను. షాజహాను చక్రవర్తి అగ్రతనయుడును సర్వమత సహనుడును, లలితకళాప్రియుడును అగు దారాయును, అతని తమ్ములగు ఔరంగజేబు మురాద్ లును సమూగర్ వద్ద పైతృకసామ్రాజ్యమునకై పోరదలపడిరి. మూర్తీభవించిన శౌర్యమోయన సాగరగంభీరుడగు దారా తన సమున్నతమగు సింహళగజముపై నారోహించి సైన్యముల నడపుచుండెను. తనసైన్య మధ్యభాగమును ఔరంగజేబు సైన్య మధ్యభాగముపై నడిపి అతనిసైన్యములను విరిగి పారునట్లొనరించెను. ఔరంగజేబు శతఘ్నిబలమును ఒంటెబలమును వికావికలై వెనుదిరిగి పరువెత్తెను. కాల్బలముగూడ దారా ధాటికాగలేక పారిపోయెను. ఔరంగజేబు చుట్టును ఒకవేయిమంది అనుచరులుమాత్రమున్నారు. దారా ఇంకొక్కదాడి సల్పినచో ఔరంగజేబునకు సర్వనాశనము. ఈనాటి ఈ స్థితి ఔరంగజేబు ధైర్యస్థయిర్యములకు, స్థితిప్రజ్ఞతకు అగ్నిపరీక్ష. అయితే ఔరంగజేబు ఆపరీక్ష కాగలిగిన సుస్థిరుడు. అతనివి ఉక్కునరములు. సాగరమువలె ఘోషించుచున్న శత్రుసైన్యములయెదుట ఒక వేయి మందితో నిలచి అతడు ఓసైనికులారా పారిపోయి ఏమి మూటగట్టుకొనెదరు. 'ధైర్యమవలంబింపుడు' దేవుడున్నాడు (ఖుదాహె). పారిపోవద్దని హెచ్చరించుచుండెను. జయమో చావో అక్కడనే జరుగవలెనని దృఢమగు నిశ్చయమొనర్చుకొనెను. తాను వెనుదిరుగుటకు వీలులేకుండ తన యేనుగుకాలికి గొలుసులు వేయించెను. అతని అప్రతిమానధైర్యమును, గంభీరభాషణములును అతని యనుచరులును, మురాద్ ఒకటిరెండు సైన్యభాగములును దారాసైన్యములను తీవ్రముగ దాకి దారావైపే బాణపరంపర గురియింప మొదలిడిరి. ఆసమయమున దారా తన జీవిత నాశనమగు ఘోర తప్పిదమును గావించెను. సైన్యమంతయు జయధ్వజమువలె నిలచియున్న అతని గజమువైపే లక్షింప మొదలిడెను. జయము తనహస్తగతమగుచున్న ఆ విఘడియలో దారా తనఏనుగను దిగిపోయెను. మధ్యందిన మార్తాండు డొక్కసారిగ ఆకసమువిడిచిపోయెను. జయలక్ష్మిని చూరగొననున్న సైన్యములు తమప్రభువును గానమిచే తలదొకదారి పరువెత్త మొదలిడిరి. దారా ఆనాడక్లైందుకు దిగిపోయెనో అది విధిగర్భమందలి రహస్యము. ఆనాడు దారా మరియొకక్షణముం గజముపై నిలిచియున్నచో హిందూదేశచరిత్ర వేరుగ నుండియుండును. ఒక్కక్షణములో ఒక జంతువు ఒక

మానవుడుగావించిన చెయిదముపై ఒక సామ్రాజ్యసౌభాగ్య మాధారపడియుండుట విధి వైచిత్ర్యముగదా! దారాషుకో నాడు జయించి యున్నచో మొగలు సామ్రాజ్య మంత త్వరితముగ క్షీణదశనొంది యుండెడిదిగాదు. అక్బరుకాలమునుండి మహమ్మదీయులతో కలిసిమెలసి మొగలు సామ్రాజ్యమునకు ప్రోద్బలమొసంగుచుండిన హిందువులు మత సహనములేని ఔరంగజేబు కాలమునుండి క్రమక్రమముగ వేరై మొగలుసామ్రాజ్య పతమునకు మూలకారకులైరి. హిందూమహమ్మదీయైక్యతకు చిహ్నమగు దారాసౌమ్యమూర్తి వారి కలయికను సుదృఢమొనరించి సామ్రాజ్యమును సుస్థిరమొనరించియుండును. కాని గడచినదానికి చింతించి ఏమి ప్రయోజనము ?

## ౪

ఇదియంతయు ఆర్యావర్త యుద్ధముల యందలి ఘటనావిశేషము. అంతటి ప్రాముఖ్యతయేగల ఒక దక్షిణదేశమహా సామ్రాజ్యము కూకటివ్రేళ్ళతో కూలిపోయిన యుద్ధమునందుగూడ విధి గజమునే తన చేయూతగా గొనెను. అయిన నీసారి ఎదిరి బలంబుల యేనుగ స్వాధీనముతప్పుటచే హైందవ బలంబుల కపజయము ప్రాప్తించెను. స్వబలంబుల గజము స్వాధీనముతప్పినను, ఎదిరి బలంబుల గజము స్వాధీనముతప్పినను హైందవులకే అపజయము సిద్ధించుట విధిక్రౌర్యముగాక వేరొకటియగునా ? అరిభయంకరమగు విజయనగర సామ్రాజ్యమును అరిగజ కంఠీరవమగు అళియ రామరాజు పాలించుచుండెను. అతనిధాటి కాగలేక బహమనీ రాజ్యపు మహమ్మదీయ ప్రభువులందరు తమతమ అంతఃకలహముల విస్మరించి, అందరు సైన్యముల గూర్చుకొని ఒక్కుమ్మడిగ విజయనగరముపై దాడి వెడలివచ్చిరి. రామరాజును ఇంచుకంతయు వెనుదీయక ప్రబల సైన్యముల గూర్చుకొని తాళికోటవద్ద మహమ్మదీయుల నెదుర్కొనెను. జనవరి 24, 1565వ సంవత్సరమున ఇరువాగులును పోరునకు దలపడిరి. ఆనాటికి రామరాజునకు తొంబదియారు వత్సరముల వయసు. కాని అతడు పోరిలో ముప్పదివత్సరముల ప్రాయపు యువకునికన్న నెక్కుడు శక్తియుత్సాహముల జూపుచుండెను. అతడు జయము తనదేయని నిశ్చయించుకొని బీజపూరు ఆదిల్‌షాహాను, గోల్కొండ ఇబ్రహీమ్‌షాహాను చంపకుండ ప్రాణములతో గొనితెమ్మని తనసైనికుల కాజ్ఞాపించెను. కాని విధి వేరువిధముగ దలంచెను. ఇచటగూడ ఒక్కే-ఒక్క ఏనుగ ఆమహాయుద్ధముయొక్క జయాపజయముల తేల్చివైచెను. ముమ్మరముగపోరుసాగుచున్న సమయమున, జయాపజయంబులు పూర్తిగ నిర్ణయముకాకపూర్వము, నిజాంషా యెక్కియున్న ఏనుగ మదమెచ్చి శత్రుసైన్యముల వైపు దూసుకొని పరువెత్తమొదలిడెను. సేవకులచే మోయబడుచున్న సింహాసనముపై ఆసీనుడై యున్న రామరాజువైపునకే అది తిన్నగా వచ్చుచుండ సేవకులు భయపడి రామరాజును దించి పరువెత్తమొదలిడిరి. సమయమునకు వేచియున్న ముసల్మానులు ఆసంకులములో రామరాజును బంధించి, అతని శిరసుచ్ఛేదించి, ఒక బల్లెమునకు గుచ్చి యెత్తిరి. ఆసమయమున హిందువులు ధైర్యముగనే పోరుచుండిరి. కాని ఆదేసమయమున తమ ప్రభువు శిరముగాంచగనే సైన్యములు విరిగి పారిపోయినవి. మహమ్మదీయులు కరవుదీర హిందువులనుచంపి, తమపరి ఆకాలమున

ప్రపంచముననెల్ల ఒక మహాపట్టణముగ నెంచబడుచుండిన విజయనగర పట్టణమును ఆరు నెలలు దోచుకొని, దగ్ధముగావించి నామ రూపములు లేకుండజేసిరి. ఒకలక్ష హిందువులకుపైగా చంపబడిరి. సూయల్ బహుశ ప్రపంచచరిత్రలో ఇంత అకస్మాత్తుగా ఇంత మహాపట్టణము ఇంతగా దగ్ధపటలముగావింపబడియుండదని ఈదినమున సకల సౌభాగ్య సమన్వితము. ఆమరునాడు దోచుకోబడి, దగ్ధముగావింపబడి, వర్ణింపనలవిగాని చిత్రవధలతోడను భయంకర మరణములతోడను బూడిదగావింపబడి యుండదని వ్రాయుచున్నాడు. ఆనాటి విద్యారణ్యుని పట్టణము నేడు కాంచిన పరదేశికికూడ కన్నీరుకాల్వలై పారు పాడుదిబ్బలయరణ్యము. ఇదియంతయు ఎదిరి ఏనుగ స్వాధీనముతప్పటచేగదా! విధి ఎంత స్వల్పవిషయముల దాగియున్నది.

ఇవియన్నియు విచారించిచూడ ఒక్కొకపరి ఏనుగ భారతదేశము పాలిటి జయలక్ష్మియా జ్యేష్టలక్ష్మియాయని- సందేహము వొడముకమానదు.

# వారానికి 18 వేల బట్టల మూటల్ని ఉతికే లాండ్రీ

[ఆ లాండ్రీకి 10 లక్షలపౌనుల మూలధనము 240 మోటారువానులు- ఆలాండ్రీలో పనివాళ్లు 3 వేలమంది— ఆలాండ్రీతరఫున తడవకు 50 వేల కాపీలచొప్పున వెలువడు త్రైమాసికపత్రిక పౌరులకు ఆనందముకూర్చుటకు ఆలాండ్రీ పక్షమున ఒక బ్యాండుమేళము.]

లాండ్రీ. మద్రాసు వచ్చివెళ్లు ప్రతి ఆంధ్రునకు లాండ్రీ అనిన ఏమియో తెలియును. ఆంధ్రదేశమున ప్రతి పెద్దపట్టణమునను ఇపుడు లాండ్రీలు వెలసియే యున్నవి. రంగూన్ వెళ్ళివచ్చిన పాటకప్రజనులు కొందఱు ఇపుడు ఒకమాదిరి పెద్ద పల్లెటూళ్ళ అన్నిటియందును లాండ్రీలు నెలకొల్పుచును ఉన్నారు. కావున లాండ్రీలును, లాండ్రీలపద్ధతియు తెలుగు వారికి బాగుగ తెలిసినవే.

అయినను ఇచ్చట చెప్పబోవు లాండ్రీ చరిత్ర తెలుగువారికి అద్భుతావహముగనుండగలదు. ఏమన ఇచ్చట వర్ణింపబడునటువంటి లాండ్రీ ఆంధ్రదేశమున ఎచ్చటగానిలేదు. ఆంధ్రదేశముననేకాదు భారతదేశముననే లేదు.

అమెరికా సంయుక్త రాష్ట్రములకు చెందిన న్యూఆర్లీన్సులో ఒక లాండ్రీఉన్నది. దానిపేరు ఫాల్మెటిలాండ్రీ. ప్రపంచములోని లాండ్రీలలో అది మొట్టమొదట పేర్కొనదగినదని చెప్పవలసి యున్నది.

వారమునకు—ఆలాండ్రీలో వారమునకు పదునెనిమిదివేల బట్టలమూటలు చలువచేయబడును.

ఆ ఫాల్మెటిలాండ్రీ అధ్యక్షుడు స్కాట్ జాతీయుడు. అతనిపేరు బి. సి. మాక్లిలన్. అతని తలిదండ్రులు నిఱుపేదలు. బాల్యముననే అతడు తన పొట్ట తాను పోషించుకొనవలసిన వాడయ్యెను. నిలుకడయైన అతని మొదటి ఉద్యోగము ఒకానొక లాండ్రీలో. వారమునకు పదునాలుగు షిల్లింగుల జీతము.

స్వల్పమగుజీతము. అగుగాక. అతడు ఎట్లో కష్టపడి అరువదిపౌనులు కూడబెట్టినాడు. కూడబెట్టుట తడవుగా అతడు ఆసొమ్ముతో దివాలాతీయుస్థితిలోనున్న ఒక లాండ్రీని వెలకుతీసినాడు. రాత్రింబగళ్లు తదేకదీక్షగా అతడు పనిచేసి దానిని లాభకరమైన వ్యాపారసంస్థగా చేసినాడు.

వారమునకు నాలుగువేల బట్టలమూటలను ఉతుకు స్థితివఱకును వ్యాపారకును పెంచినాడు. ఎంత తంటాలుపడినను వ్యాపారము ఆమీద పెరిగినది కాదు. ఆవ్యాపారముయొక్క అభివృద్ధిపారము ముట్టినట్లు కనిపించినది.

ఇట్లుండ 1910-వ సంవత్సరమున ఒకనాడు న్యూఆర్లీన్సునందలి ఒకానొక దినపత్రికయొక్క అడ్వర్టయిజుమెంటు మేనేజరు ఎ. జి. నేమియర్ అనువతడు మాక్లిలన్ ఆఫీసుకువచ్చి 'మీలాండ్రీనిగూర్చి పత్రికలో ఎడ్వర్టయిజు చేసిమాడుము. దానివలన ఏమైన కొత్తలాభముండునేమో గమనింపుము' అని చెప్పినాడు.

అట్లు చెప్పుటయేకాదు. తనపత్రికలో అరపుట స్థలము ఫాల్మెటిలాండ్రీ ప్రకటనకు ఉచితముగా ఈయగలననియు ప్రోత్సహించినాడు.

'ప్రకటనకుగాను ఉచితస్థలమునాకు అవసరము లేదు. వేయుచో డబ్బుఇచ్చియే ప్రకటనవేయుదును.

ప్రకటనవిషయమై ఆలోచించి నెమ్మదిమీద చెప్పెదను’ అని మాక్లిలన్ బదులు చెప్పినాడు.

మాక్లిలన్, నేమియర్ ఇరువురును దీర్ఘముగ ఆలోచించి ఛాల్మెటిలాండ్రీ ప్రకటన ప్రచారమునకు ఒక పద్ధతి నిర్ణయించినారు. మొదటి సంవత్సరము పత్రికలయందు ప్రకటించుటకు మాక్లిలన్ వేయిపౌనులు వెచ్చపెట్టుటకు అంగీకరించినాడు. ఆ ప్రకటన అతనికి ఎంతయో లాభమును కూర్చినది. ఎందఱో క్రొత్త ఖాతాదారులను కొనివచ్చినది. ప్రకటనయొక్క ప్రయోజనము మాక్లిలన్‌కు తెలిసివచ్చినది. కాగా అతడు ప్రకటనవిషయమై ఇంకను హెచ్చుసొమ్ము వ్యయముచేయ దొరకొన్నాడు.

న్యూఆర్లీన్సులో ఆదినములందు బట్టలుఉతుకుపని అంతయు నీగ్రోచాకలల చేతులలోనుండెను. బట్టలు ఉతుకు పద్ధతియు, ప్రదేశమును చాల అశుచిగానుండెను.

మాక్లిలన్ ఇదికనిపెట్టి తన ప్రకటనలందు బట్టలుఉతుకు పద్ధతియు, ప్రదేశమును శుచిగానుండవలసిన అవశ్యకతనుగూర్చి బోధింపసాగెను. ప్రతి గృహస్థుడును, ప్రతి గృహిణియు ఈవిషయమై తీవ్రమగు చర్చ సాగింపజొచ్చిరి.

పిమ్మట మాక్లిలన్ ఒక కెమిస్టును తనవద్ద పనికి కుదుర్చుకొనెను. బట్టలుఉతుకు నీటిని, సబ్బును, బట్టలను ఇస్త్రీచేయుబొగ్గును, ఇతర కెమికల్సును పరీక్షచేయుట ఆకెమిస్టుపని. లాండ్రీపనికి కావలసిన యంత్రములను నూతన సౌకర్యములు సమస్తము సమకూడియున్న క్రొత్తవానిని కొనినాడు.

ప్రకటన అతని కెంతమేలుకూర్చినదో ప్రజాసామాన్యమునకును అంతమేలును కూర్చినది. దినదినము క్రొత్త అభివృద్ధిపద్ధతులను అవలంభించునట్లు ఆ ప్రకటనలు అతనిని ప్రోత్సహించినవి. సర్వసమర్థమై తన లాండ్రీ వెలయుటకుగాను అతడు సకల ప్రయత్నములు చేసినాడు.

ఇట్లుండ ఆ లాండ్రీని ఒకక్రొత్తసమస్య ఎదుర్కొనెను. ప్రకటన విషయమైలోగడ తనకు ఉపదేశము చేసిన నేమియర్ వద్దకుపోయి మాక్లిలన్ తనలాండ్రీని ఎదుర్కొనినక్రొత్తసమస్యను ఇట్లు వివరించిచెప్పెను: ‘వారములో మొదటి మూడురోజులును మాలాండ్రీలో ఊపిరిసలుపని పనిఉంటున్నది. మిగిలిన మూడురోజులును బొత్తిగా పనిఉండుటలేదు. గురు, శుక్ర, శనివారములందును సోమ, మంగళ, బుధవారములందువలె లాండ్రీకి నిండుపని ఉండుటఎట్లు?’

నేమియర్ ఆలోచించి ఒకపద్ధతిని సూచించినాడు. ‘ఉతుకుటకుగాను సోమవారము తీసికొనిన బట్టలను ఉతికి బుధవారమునాడు ఖాతాదారులకు అప్పగించుము. అట్లే మంగళవారము తీసికొనిన బట్టలను గురువారమునాడును, బుధవారముతీసికొనిన బట్టలను శుక్రవారమునాడును ఖాతాదారులకు అప్పగించుచుండుము. మరియు వారమునకు చివరదినములలో ఉతుకుటకు వేయబడుబట్టలకు చార్జి కొంత తగ్గించుము.’

నేమియర్ సూచించిన ఈపద్ధతిని మాక్లిలన్ ఆచరణలో పెట్టినాడు. చక్కగసాగినది. ఇతరలాండ్రీ యజమానులందరును ఈపద్దతి తప్పక అపజయమునందునని జోస్యము చెప్పిరి. కాని వారిజోస్యము నిజముకాలేదు. మాక్లిలన్ చేపట్టిన ప్రకటనపద్ధతి దానికి జయమునుకూర్చినది. నాలుగేనాలుగు ప్రకటనలు వేయుసరికి అతని లాండ్రీలో సోమవారమునాడు ఎన్నిబట్టలుపడునవో శుక్రవారమునాడును అన్నిబట్టలు పడుటకు ప్రారంభమైనది.

అదియునుగాక బట్టలను కొనివచ్చి కొనిపోవు తన మోటారువానుల డ్రైవరులకు అతను మంచితరిఫీయతునిచ్చి ఖాతాదారులయెడ అణకువతోడను మర్యాదగను వర్తించునట్లు చేసినాడు. వ్యాపారాభివృద్ధికివలయు సమస్త విషయములును వారికి నేర్పినాడు.

అందుతో అద్భుతఫలముకలిగినది. ఇతర లాండ్రీ యజమానులు మాక్లిలన్ ఛాల్మెటీలాండ్రీ పోటికి

నిలబడలేకపోయిరి. ఇతరలాండ్రీ యజమానులు తొమ్మండుగురువచ్చి తమ వ్యాపారమును ఫాల్మెటీ లాండ్రీ వ్యాపారముతో లీనముచేసుకొన ప్రార్థించిరి.

తానుకాదనుచో ఆలాండ్రీ యజమానులు చేయగలది ఏమియులేదు. అయినను ఉదారాశయుడగు మాక్లిలన్ వారి ప్రార్థనము కాదనలేదు. ఆలాండ్రీల నన్నిటిని తనలాండ్రీతో సమ్మేళన మొనరించినాడు. ఇప్పుడు అతనిక్రింద మూడువేలమంది పనివాళ్లు. ఖాతాదారులనుండి మాసినబట్టలను గొనివచ్చి తిరిగి వారికి ఉతికినబట్టలను అప్పగించుటకుగాను అతనికి రెండువందల నలుబది మోటార్ వానులు గలవు. అతనిమూలధనము 1930 లో పదిలక్షలు.

దరిమిలాను అతను తన లాండ్రీతరఫున ఒక బ్యాండుమేళమును నియోగించినాడు. అది పౌరులకు ఉచితముగా ఆనందము కూర్చుచుండును. ఏడాదికి నాలుగుసారులు హోమ్‌జర్నలు అను పత్రికను అతను వెలువరించుచుండును. ఏబదివేల కాపీలు. పాఠశాలలందలి విద్యార్థులకును విద్యార్థినులకును వానిని వుచితముగా పంచిఇచ్చును.

1929 లో అట్లాంటాలో అతడు మరికొన్ని లాండ్రీలను ఏకముచేసి పదిలక్షలపౌనుల మూలధనముగల లాండ్రీసంస్థను ఏర్పఱచినాడు. ఆతని జీవితపు కడకాలము ఇట్టి లాండ్రీల సమ్మేళన కృత్యములతో కడతేరునేమో !

ఇంతకును ఆతని ఇట్టి వ్యాపారవిజయమునకు ప్రారంభదినమెద్ది? ఎ. జి. నేమియర్ అతనికి ప్రకటనను గూర్చి సలహాఇచ్చినదినమే.

మాక్లిలన్ విషయమున, ఇంకను పలువురు వర్తకుల విషయమున ప్రకటనయే పూర్తిసామర్థ్యమును పొందుటకును, మంచిలాభమును బడయుటకును దారి చూపినది. ఈసంగతిని ప్రతివర్తకుడును లెస్సగ గుర్తింపవలసియున్నది. మాక్లిలన్ చేసిన పనిని నీవును చేయగలవు.

ప్రకటనయొక్క మాహాత్మ్యమును మాత్రము గుర్తింపుము.





# శ్రీ వేదవల్లి తాయారమ్మాళ్

రచయిత:

కవికొండల వెంకటరావు, బి. ఏ., బి. యల్.

["అంటే వాళ్లంతా కూడా ఓయి! వెంబరివిత్తా! కొప్పులో పువ్వులు గుప్పెట్లో పువ్వులు మావి మావే, మీవి మీవే! మాదీ మీదీ అయ్యాది నాణ్యాలమారక మొక్కలేనోయి!' అని చిల్లఱ గిరాకేశారు."]

కన్నప్పనుబట్టి మహాదేవళం పెరిగినట్టే, చన్నప్పనుబట్టి మహాపట్నం పెరిగిన గాథ కూడా ఒకటివుంది. ఉందికాని ఆగాథ ఇప్పుడెవరికీ అక్కర్లేదు. ఇప్పుడు చన్నపట్నం అనే పేరుకన్న మెడ్రాసు అనేపేరే బాగా చలామణి అవుతూవుంది.

చన్నప్ప నెక్కడ వెదుకుదామన్నా ఆ పట్నంలో కనబడడు. మరేమైపోయినాడు? ఉత్తరాదికేసి కాశీపోయినాడా? దక్షిణాదికేసి రామేశ్వరంపోయినాడా? స్టీమరెక్కి రంగూన్ పోయినాడా? రైలెక్కి బొంబాయిపోయినాడా?—ఇలాగ్గా ఆలోచనపోయింది. వోకానీ అద్దెఇచ్చి వోక్షణికం మదరాసు మరీనావోరే ఈజీచైర్లో చతికలబడ్డానో లేదో నాభావాంబరవీధిని— అలాగ్గా ఆలోచనపోయింది. ఆపాళంగా ఏలాపైకిలేచి ప్రత్యక్షమైనాడో చన్నప్ప సముద్రమ్మధ్య మంథరగిరిలా లేచి, తనకు మోకాలిబంటినీరే సముద్రమన్నట్టు, నడిచివచ్చేశాడు నాదగ్గరకు.

"నన్ను తల్చుకుంటున్నావు. ఎందుకు?" అన్నాడు చన్నప్ప. అంటే చెప్పొద్దూ ఏదో జవాబు నేను? "చన్నప్పా! నీవు పెద్దపెద్ద మేడలూ పెద్దపెద్ద మిద్దెలూ నిర్మించి, పేటలు వృద్ధిగావించి, విద్యాలయాలు సమృద్ధిగా మొలిపించి, తారురోడ్లను పూయించి, పెట్రోలు ఏఅంగలోపడితే ఆ అంగలోనే పోయించి, విద్యుద్దీపాలు ఏవింగులోపడితే ఆ వింగులోనే మెటిపించి, ఇంతగా తంటాలు పడుతువున్నా నీపేరెవరూ ఈపట్నంలో చెప్పుకోరేంచేతనోయి! నీకొక్క శిలావిగ్రహం ఈనగరంలో వెలిసిందికాదేంచేతనోయి!" అని అడిగాను.

అంటే అన్నాడు చన్నప్ప. "నాయనా! నీవూ ఐహికభోగపరాయణుడివిలాగే నా కంటికి కనబడుతూవున్నావు. ఇంతదగ్గఱసా ఈసముద్రపువారకు వచ్చికూడా కేవలం కిందిచూపేగాని పైచూపు సంపాదించుకోలేక పోయినావు!" అని ఎటకరించినట్టు మాటాడాడు. నేను ఈజీచైరు వెంటనేదిగిపోయి యిసకమీద చతికిలబడ్డాను. చన్నప్ప నాప్రక్కనే కూర్చుని యిలాచెప్పేడు తనగాథ.—

"అసల్లో నేను బాగా లావుగావుండే వాణ్ణి. మంచి భోజనప్రియుణ్ణి. భేషైన సంపాదనపరుణ్ణి, ఇంకాఇంకా చెప్పొస్తే అఖిల విద్యా విశారదుణ్ణి, సకలగుణాభిరాముణ్ణి: ఇలా రెచ్చిపోతూవుండగా ఓపొద్దు చటక్కున నాకళ్లుపోయివూరుకున్నాయి. లోకమంతా 'అంతేకావాలి! మదాంధుడికి కళ్లూపోక వొళ్లూతియ్యక, వొక్షిటాకీగా ఎంతకాలం నడుస్తుంది?' అని అనుకోసాగారు. కర్ణా

కర్ణిగ్గా వారియూసు నాచెవిని సోకింది. సోకడం ఏమిటి? అనుభవానికి వచ్చేసింది. భాగ్యంపోయింది. బట్టపోయింది. వీథులంట బోఅగానివాణ్ణయి, గంజివుందా నంజువుందా అని అడుక్కోవలసివచ్చింది. నేనొక్కణ్ణేఅవితే ఏలాగన్నా యేడవగలను. ఇంట్లో ఇల్లాలు! అది యిల్లువిడిచి యివలకురానసీది. ఇంట్లోకి తీసుకొచ్చి తనమొగాన్ని అన్నీ పెడితే ఎంతపని అయినా చేస్తాను అనీది అది. దాన్ని నట్టింట అలా మాడబెట్టి, నేను వీధిలో చెట్టునీడను కూర్చుంటేమాత్రం కూడికా అది?

అంచేత అది పనికాదనుకోని, దానితో ఒకసమయం చేసుకోవాలనుకోని. ఇలా అన్నాను. "మనం వొకరియింటిదగ్గఱకువెళ్ళి కూర్చోవద్దు. ఈవూళ్లో పార్థసారథిస్వామి వారిగుడి వున్నదే అక్కడకువెళ్ళి ఆగుడి ముందు గుడ్డపఱచుకుని కూర్చుందాం. వచ్చిపోయే అమ్మలక్కలువేసే డబ్బులూ దమ్మిడీలూ నీకూనాకూ తిండికి సరిపోతవి" అన్నాను. అంటే అది- ఆనాపెండ్లాం- పక్కన నవ్వి—"మంచి ఆలోచనే సెప్పారు! మునుపూ ముందూ మనం గుళ్ళోకివెళ్ళి గుమికీలూ కుమ్ములూతిన్నవి చాలకా యిప్పుడు మళ్ళీ ఆదరికి నన్నుతీసుకుని వెడతామనడం! మంచి మొగాళ్లేమీరు!" అని అంది. గుడీ, దేవుడూ అంటేనీకటువంటి భక్తివుంది కనుకనే మనం ఇలాఅయినాం అని లోలో అనుకోని, దాన్ని మఱేంఅనక, ఇంటనే అట్టేపెట్టి, నేను వొంటిగా నాకఱ్ఱతోతడుముకుంటూ, తోసుకుంటూ, తిరువళక్కేణి శ్రీపార్థసారథిస్వామి వారి ఆలయప్రాంగణానికిఁబోయి అక్కడ బట్టపఱచుకూర్చున్నా.

కూర్చుంటే నాబట్టలో భక్తులు పడేసిన రూకలు, రూపాయలు, కాసులు, మొహిరీలు, తంగుతంగుమనిపడి నన్ను పరవశుణ్ణిచేసి పారేశాయి. కొంతసేపైనాక అవన్నీ యింటికి మూటకట్టి పట్టుకువెళ్ళి మా ఆవిడ ముందు పెడితినిగదా! అదిల్లా మూటనొక్కి నోరునొక్కుకుని—ఇవేం రూకలు! ఇవేం మొహరీలు! జలగల్లాగు మెత్తగావుంటాయా రూకలూ మొహరీలూ?—అంది. అంటే విప్పిచూడు అన్నాడు. అంటేచూచి—పువ్వులండీ! ఇవన్నీ పువ్వులండీ! పువ్వులు తిండికెలా పనికివస్తాయండీ? అవతల పారబోయండి!" అంది. అంటే పోనీ వాసన చూచుకొందాం. పువ్వులైతేమాత్రం పనికి రావుటే?" అన్నాను నేను. అంటే అది "ముందు ఆకలితీరాలి! నాకు చాలా ఆకలవుతోంది." అని ఆపువ్వులన్నీ వీథిలో, చేటతో దుమ్మెత్తి పారబోసినట్టు పారబోసి వూరుకుంది. నేనూ అదీకూడా ఆరాత్రి వుపవాసమే. ఒక్కపువ్వు నన్ను వాసన చూణ్ణిచ్చిందికాదు. తాను వాసనచూచిందిలేదు. తెల్లాఱిపోయింది.

మర్నాటిమాట? నిరాశ ఎక్కువ కాఁజొచ్చింది నాహృదయకోశంలో. అయినా ఇదంతా ఏదోమాయగా తోస్తుంది. గుళ్లో, వాళ్లు నాబట్టలో పడేసినప్పుడు పువ్వులైతే అవి తంగుతంగుమంటవా? ఇందలి సత్యమేమిటో తెలిసికోవాలి అని మర్నాడు ప్రక్కన కూర్చున్న కళ్లున్న మామోలు బిచ్చగాణ్ణి వొక్కణ్ణి' కనిపెట్టు నాయనా! కాస్తంత! వాళ్లూవీళ్లూ నాగుడ్డలో పడేసేవి రాళ్లో రప్పలో రూకలో నూకలో' అని ప్రోత్సహించాను. వాడు చూచిచూచి వెఱ్ఱిగా 'రూకలేనోయి! కాసులేనోయి!' అని నాచెవిలో వూదేడు. 'బాగుంది' అని విఱ్ఱవీగుతూ మళ్ళీ అవన్నీ మూటగట్టుకొని క్రిందటిరేత్రిలాగే పట్టుకువెళ్ళి ఆడదానిముందు పెట్టి, 'ఇవి మార్చి పప్పూ, ఉప్పూ, అన్నీ సంబాళించుకు

రా!' అన్నాను. అది మళ్ళీ యథాప్రకారంగా మూటెత్తి నేలనుపెడుతూ 'చప్పుడు లేదు, ఇవాళా చప్పుడు లేదు. మీమూట మండిపోయిరి!' అంది. అంటే విప్పిచూడు! విప్పిచూడకుండా పేలకు!' అన్నానేను. అంటే విప్పిచూచిందై—'ఇవాళా పువ్వులే తగలేశావు!' అంది. అంటే 'మనకుప్రాప్తం పువ్వులే కామోసు? పువ్వుల్ని ఏంచెయ్యాలో ఆపనిచేసి చూదాం! మూసూదాం!' అన్నాను. 'మూ చూడ్డంకాదు. అగ్గిముట్టించి ధూపం ఎగబీల్చు!' అంటూ పట్టుకుపోయి పెరట్లో గోతిలో నప్పెట్టి చక్కావచ్చింది. రెండోరాత్రి కూడా ఆసంపాదించి తెచ్చిన వాటిలోని వొక్కపువ్వూ నేనుగాని అదిగాని మూర్కోలేదు! పేర్కోలేదు!

మూడోరోజు వుదయం ఇఖ నేనుబడ్డ వ్యాధికి మందే లేదనిపించింది. అయినప్పటికీ ఏదో మహత్తుగావుంది ఈమహావిపత్తు అని తలపోసి యథాప్రకారంగా నా నమ్మకం కొద్దీ కోవెల గుమ్మంకాడ మళ్ళీ వస్త్రం పఱచుకూర్చున్నాను. కూర్చుని 'అమ్మా! తల్లీ! తండ్రీ! అప్పా! నాడెంగా నాణ్యాలూ తండులాలూ పడెయ్యండి. మరువం దమనం, మల్లెచామంతి, జాజి, రోజా, అవినాకువద్దు. నాడెంగా నాణ్యాలూ తండులాలూ పడెయ్యండి' అని దాతల్ని హెచ్చరించాను. అంటే వాళ్ళంతాకూడా 'ఓయి! వెంబరివిత్తా! కొప్పులోపువ్వులు గుప్పెట్లోపువ్వులు మావిమావే మీవిమీవే! మాదీమీదీ అయ్యేది నాణ్యాలమారక మొక్కటేనోయీ!' అని చిల్లఱగిరాటేశారు. 'బాబూ బ్రతికానురా నేను!' అని అదంతా మూటగట్టుకుని తిరిగి యింటికివెళ్ళి నేనే మూటవిప్పి భార్యముందుపోసి నాచేతుల్తో లెక్కెడుతూ వొకొక్కక్కటే దానిచేతిలో పోశాను. పోస్తూవుంటే 'ఇదేందిరా! నీచేతిలో నాణెంగా వుండి నాచేతిలోకి వచ్చేసరికి పూవ్వై పోతూ వుంది! ప్రతీదీ!' అని వోపువ్వు వాసనచూచింది. కడుపునిండినట్టు గర్రున త్రేంచింది. ఓపువ్వు నాముక్కుదగ్గ ఱెట్టింది. నేను దానికంటె ఎక్కువగా గర్రున త్రేంచాను. ఓపువ్వు అది తల్లోపెట్టుకుంది. ఇల్లంతా వెలుగైపోయింది. ఓపువ్వు నామీదికి విసిరింది అది. నాకళ్ళకు మళ్ళీ ఎక్కళ్ళేని చూపు వచ్చేసింది.

ఆపాళంగా ఆచీకటి రేత్రే నాతలోదరి వీథిలోకీ పెరట్లోకీ పఱుగెత్తుకెళ్ళి 'నిన్నా మొన్నా మనంపారేశిన పువ్వులెక్కడున్నాయో చూపెట్టండీ! మీకు జ్ఞాపకంవుంటేను' అని గట్టిగా అఱవడం ప్రారంభించింది.

ఊళ్లోవాళ్ళంతా చేరువకొచ్చి 'ఏంవస్తువు పోయింది ఆలానెమకుతున్నారు?' అని అడిగినారు. మేమిద్దఱం మాట్లాడకపోతే విస్తుపోయి 'చన్నప్పా! చెప్పు!' అన్నారు. ఏమని చెప్పేది?—వేదవల్లి పైకెదిగి ఆకాశాన్ని రాత్రులందు పువ్వులు పూస్తా వుందట కాదూ?—అన్నాను.

అందఱూకూడా 'ఎప్పట్నుంచి? ఎప్పట్నుంచి?' అని ప్రశ్నించడమే! చెప్పడానికి నాకూ నాభార్యకూకూడా సిగ్గయిపోయింది. గతరాత్రినుంచి అని చెప్పనా? గతరాత్రికింకా వెనకటిరాత్రినుంచి అని చెప్పనా?

చన్నప్పకు పేరెందుకు? చన్నప్పకు శిలావిగ్రహంఎందుకు? మఱెప్పట్నుంచి అనేచర్చ అలాకట్టిపెట్టి, ఆకాశానివి చుక్కలో పువ్వులో తెలియక కొట్టుమిట్టాడుతూ వున్నాను ఇప్పటికీ నేను' అని అన్నాడు.

'చెన్నప్పా! సెలవు' అన్నాను. లేందే అతను అక్కడనాముందు! నేను వదిలేసిన ఈజీచైర్? అదీలేదు! అక్కడ.



# రాయబారి

రచయిత:

కొడవటిగంటి కుటుంబరావు.

'ప్రకాశం?' అని మెల్లిగా కేక. తరవాత సంకోచిస్తూ చేసిన తలుపుచప్పుడు.

భోంచేస్తూ మాణిక్యంతో సరసాలాడుతున్న ప్రకాశానికిగాని, భోజనంపెడుతూ ప్రకాశంతో సరసాలాడుతున్న మాణిక్యానికిగాని ఆకేకా తలుపుచప్పుడూ వినిపించలేదు.

ఒక్క పావునిమిషం ఉండి మళ్ళీ, 'ప్రకాశం!' ఈసారి కాస్తగట్టిగా. కాస్తగట్టిగానే తలుపుచప్పుడుకూడా.

'ఉండు! ఉండు! ఎవరో తలుపుతట్టుతున్నట్టున్నారు' అన్నాడు ప్రకాశం ఆలకిస్తూ.

'మీరే మాట్లాడుతూ నన్ను వుండమంటారేమిటి? ఇది మరీబాగుంది! ఓహో!—'

'అబ్బ! నీకు సరసానిక్కూడా వేళాపాళాలేదు- అదుగో ఎవరో తలుపు తట్టుతున్నారు!'

'అవును! అందుకనే భోజనంముందు కూర్చుని ప్రారంభించాను సరసం!'

ప్రకాశం? ప్రకాశం!' గట్టిగా తలుపు చప్పుడు.

'ఎవరింట్లో?'

'ఎవరో వచ్చారు. వెళ్లు. తలుపుతీసి, అట్లా గదిలో కూర్చోబెట్టి, పేరేమిటో కనుక్కురా!'

'నేను వెళ్ళనమ్మా! నాకోసం వచ్చారని చెప్తారు తరవాత!'

ప్రకాశం సంతోషంతో ఇకిలిస్తూ, 'ఇప్పుడు నువుమాత్రం ఏంచేస్తున్నావేం, చెప్పక? నా పేరు పెట్టి పిలుస్తుంటే నీకోసం వచ్చారనటానికి నాకు మతిలేదనుకున్నావా?...పో, పో! వెళ్ళి తలుపు తీసిరా!' అన్నాడు.

మాణిక్యం ఆయిన ఆలిశ్యంయావత్తూ కమ్మేసేటందుకల్లే పరిగెత్తుకుంటూవచ్చి గడియతీసి తలుపులు తెరిచి, చప్పున భయపడ్డదానల్లే ఒక్క అడుగు వెనక్కు వేసింది. ఆమె మొహంమీది చిరునవ్వు తుడిచివేసినట్టు మాయం అయింది. తలుపు తియ్యటంతో తన పని పూర్తిఅయినట్టు మాణిక్యం వెనక్కుతిరిగి నాలుగడుగులు వేసి వచ్చిన మనిషిని కనీసం కూర్చోనన్నా పెట్టాలని జ్ఞాపకంవచ్చి, 'అట్లాగదిలో కూర్చోండి. భోంచేస్తున్నారు. వస్తారు!' అని ఎట్లాగో లోపలపడ్డది.

'ఎవరావచ్చింది?' అన్నాడు ప్రకాశం మాణిక్యం వాలకంచూసి ఆశ్చర్యపోతూ.

మైళ్లు పరుగెత్తివచ్చినదానల్లే శ్వాస ఆడకుండా మాణిక్యం 'ఏమో, నేను అడగటం మరచిపోయినాను!' అన్నది.

'దయ్యం చూసినదానల్లే అట్లాఅయినా వేమిటి? ...ఎల్లా వున్నాడు?'

'ఏమో, పొడుగ్గా సన్నగా వున్నట్టున్నారు. నేను సరిగా చూడలేదు. నాకెందుకో ఆయన్ను చూడగానే భయంవేసింది!' అన్నది మాణిక్యం, తన భయం తలుచుకొని చిరునవ్వు నవ్వుతూ.

'కళ్ళజోడుందా?'

'ఏమో!'

'బట్టకట్టుకున్నాడా?'

'ఏమో!'

'కోటు-'

'ఏమో! అబ్బ! నేను సరిగాచూడలేదండీ!'

'కళ్లు మూసుకున్నావా ఏమిటి? లేక అంత తేరి పారచూడరాని విగ్రహమా?'

'అబ్బ! మెల్లిగామాట్లాడండి! అవతల ఆయనకు వినపడుతుంది!'

'పిచ్చిమొద్దూ! వెళ్ళి పేరడిగిరా!'

'నేను పోను!'

అయిపోవస్తున్న భోజనం త్వరగా పూర్తి చేసి ప్రకాశం ఆదరాబాదరా చెయ్యి కంచంలో నే కడుక్కొని అవతలికి వెళ్లాడు. తరవాత కాస్సేపటికి మాణిక్యానికి ప్రకాశం 'ఓరి గంగాధరం! నువ్వే నుట్రా? మామణిని బాగా బెదరగొట్నావే?' అనటం వినిపించింది. ఆగంగాధరం ఎవరో ప్రకాశం కోసరం ఎందుకువచ్చాడో గ్రహించటానికి వారి సంభాషణ విందామని మాణిక్యం ప్రయత్నంచేసింది కాని లాభం లేకపోయింది. ఎంతమెల్లిగా మాటలాడినా ప్రకాశంగొంతు వినిపిస్తున్నది కాని, ఆగంగాధరం గొంతు బొత్తిగా వినిపించనేలేదు. ఆయన అసలు మాటలాడుతున్న అలికిడైనా లేదు. మాణిక్యం విసిగి భోజనానికి కూర్చున్నది.

'ఏమిట్రా, విశేషాలూ? ఏదో మహాత్కార్యం భుజానపెట్టుకుని వచ్చినవాడల్లే కనిపిస్తున్నావే!' అన్నాడు ప్రకాశం.

'ఏం మహాత్కార్యంలే!......నీభార్యతరఫున రాయబారిగా వచ్చాను. ఈరాయభారానికి నిజంగా నేను తగినవాణ్ణికాదు. ఎందుకంటే మీయిద్దరికీ ఎందుకు చెడ్డదో నే నెరగను. తరవాత, రావటానికి నేను నీభార్యకు పింతల్లికొడుకును అయినప్పటికీ మనిద్దరమూ చిన్నప్పటినించీ స్నేహితులం. మూడోవిశేషం ఏమిటంటే నీభార్య వుత్త వెకిలి మనిషిఅనీ, అది ఎటువంటి భర్తనూ సంతోషపెట్టగల తెలివితేటలు లేనిదనీ తెలుసు నాకు. నాకు నీమీదే పక్షపాతం. ఇదంతా మా సుందరంతో స్పష్టంగా చెప్పాను అయినా అది నన్నే వెళ్ళమన్నది.

'ఇక అది నీతో అనమన్నదేమిటంటే—పొరపాటు తనదేననీ, అజ్ఞానంగా తను ప్రవర్తించిన మాట నిజమేననీ ఒప్పుకుంటే తనను మళ్ళా ఏలుతావేమో కనుక్కోమన్నది.

'ఒలికిపోయిన పాలు—'

'పొరపాటు తనదేనని గ్రహించిందనికాదుసుమా! అట్లా తను అంటే నువు దాన్ని చేపట్టుతావా అని. ఇందులో కొస్త తిరుగుడున్నది. నువు తనదగ్గిరికి తిరిగివచ్చే షరతులమీద అంటుందన్నమాట, తప్పు తనదేనని!... ఈరాయబారం నేను సరిగా జరపటం లేదేమో! కాని అందుకు నే నేమీ పశ్చాత్తాపపడను. ఏమంటే మాసుందరి ధోరణి వుండే నాకు చెడ్డచిరాకు తెప్పించింది. నేను దానితో అన్నట్టే నీవిషయమై పక్షపాతంవహించి మాటలాడుతున్నాను. నేను తిరిగి వెళ్ళి దానితో చెబుతాను కూడానూ సంధిపొసగకుండా రాయబారం చేశానని! నాకేం భయమా?'

ప్రకాశం నవ్వాడు.

'దాందుంపతెగిరిలే! అవిషయంపోనీ! ఎక్కడైనా విరిగినమనస్సు అతకటం ఉందా? నేనూ మణీ చాలా సుఖంగాకాలక్షేపం చేస్తున్నాం. మణి ఇంటర్మీడియేట్ వరకూ చదువుకుందని నేను నావుత్తరంలో రాశానుకాదూ? ఈజన్మకు నాకదేభార్యా, నేనే దానికి భర్తనూ! ఇప్పుడు తిరిగి నాభార్యదగ్గిరికి వెళ్లినా దాంతో ఏంమాటాడాలోకూడా తెలీదు, ఒట్టూ!'

గంగాధరం తను వచ్చినపని అయిపోయినట్టు దిక్కులుచూడటం మొదలుపెట్టాడు. ఇతంలో ఏదో జ్ఞాపకమువచ్చినట్టు, 'అన్నట్టు మీనాన్నమాత్రం చాలా ఖేదిస్తున్నాడురా! ఆయనకెన్నోరకాల బోధించాను, కాని వెళ్లతోకూడా పొతుకునిపోయిన అభిప్రాయాలు ఇట్టే పీకివెయ్యాలంటే సాధ్యమౌతుందా? చివరకు నావిషయంకూడా చెప్పాను. మనస్సు కలవని భార్యతో కాపరంచెయ్యటం ఏమిటో నాకు తెలుసు నన్నాను. నేను వస్తుతహా కఠినహృదయుణ్ణి కాకపోయినప్పటికీ నాభార్య చచ్చిపోవటం నాకు చాలా తెరిపి అయినట్టయిందనీ, మళ్ళీ

పెళ్ళి అనేమాట తలపెట్టటానికైనా నాకు దమ్ము లేకుండాపోయి నేను పూర్తిగా స్త్రీవిముఖుణ్ణికూడా అయినానని అన్నాను......లోకం, లోంభై అనుకుంటుంది. వాటికి లక్ష్యపెట్టి మనసుఖం పాడుచేసుకోవటంకంటె పొరపాటులేదు. నువు నిజంగా సుఖపడుతున్నానంటున్నావు కనక—' అన్నాడు.

'సుఖం ఏమిటి? నాకు రవ్వంతయినా చీకూ చింతాలేదనుకో, స్వర్గంలో వున్నట్టుంది.'

'కనక నీపద్ధతులేమీమార్చుకోకు—ఇంకొకరికోసం. నిజం ఆలోచిస్తే మనకోసం మారేవారెవరూ లేరు ఈ ప్రపంచంలో. నీ సొంతభార్యేఏంచేసింది చెపుదూ! నీకోసం చిన్న మెత్తయినా మారిందా?'

'ఎబ్బే!'

'అంతే మరీ!'

గంగాధరాన్ని చూస్తే ప్రకాశానికి మొదటినించీ ప్రేమే. కాని ప్రకాశం ఆక్షణంలో గంగాధరాన్ని ఎన్నడూ ప్రేమించలేనంత ప్రేమించాడు. మరొకడైతే తప్పక తన పినతల్లికుమార్తెవైపే పలుకును, ఇవతలవాడు ఎంత బాల్యస్నేహితుడైనాసరే! గంగాధరం నిజంగా చాలాయోగ్యుడు. నిజం గ్రహించగలవాడున్నూ!

'ఇక నేను వెళ్లివస్తానురా, ప్రకాశం. నాపని అయిపోయింది. నీభార్యతో ఏంచెప్పమన్నావు?'

'నా జన్మకు కొత్తసుఖపడటమనేది నేర్చుకునేటప్పటికి దానికి అడ్డం తలుగుదామని చూస్తున్నావా? అని అన్నానని చెప్పు!...నువు వెళ్లుదువుగాని లేరా! ఒకరోజుండి పోరాదూ?'

'కాదురా! వెళ్లాలి. ధాన్యమూ అదీ అమ్మించలేదు. కొత్తపొలమూ పుట్రా చూసుకోవాలి. రైతులను కూడామార్చాలి. ఇప్పుడు చేస్తున్నవాళ్లు మరీ పేచీఖోరులుగావున్నారు. మా నాన్నేమో తనచేతిమీద గాకొన్నపొలం తనచేతిమీదిగానే అమ్మలేక చూస్తూ చూస్తూ, అప్పు బోలెడంత పెరగనిచ్చాడు. రెండెకరాలు బేరంకూడా పెట్టిరావాలి మానాన్న పోగానే చెయ్యవలిసింది, పడలేదు. ఈ యేడైనా...నీయోగక్షేమం రాస్తూవుండు. బడికి వేళ అవుతున్నది. వస్తానురా, ప్రకాశం!' అని గంగాధరం లేచాడు.

'సరే, మంచిది! ...నిన్ను చూడటంనా కెంతో సంతోషంగా వుందిరా, ప్రాణం లేచివచ్చిందన్నమాట!'

మాణిక్యం భోంచేసి వచ్చేటప్పటికి గంగాధరం వెళ్లిపోయినాడు. ఆమె కేమాత్రమో ఆశాభంగమయింది!

ప్రకాశంపెట్టిన రెండునెలలసెలవూ అయిపోవస్తున్నది మాణిక్యాన్ని తనవూరు ఎట్లాగా తీసుకుపోవటం, ఏంచెయ్యటమా అని అతను మధనపడుతూండగానే శుభవార్త వచ్చింది తన వుద్యోగం ఊడిందనీ, తనస్థానే పనిచేస్తున్న అతన్ని ఆఖాళీలో ఖాయపరిచారనీ.

ఆమాట వినగానే మాణిక్యం దిగులుపడ్డది.

'ఆవుద్యోగం నాకు మా పినమామగారిప్పించాడు. తీసివేయించటం కూడా ఆయన కట్టుకున్న పుణ్యామే అయివుంటుంది. పోనీలే, పీడ విరగడఅయిపోయింది. మానాన్న నడిగిడబ్బు తెప్పించుకుంటాను,' అన్నాడు ప్రకాశం.

అతను తండ్రికిరాసిన వుత్తరానికి మూడోనాడే సమాధానం వచ్చింది.

'నువు చేసినపనికి తల ఎత్తుకుని తిరగలేక చస్తున్నాను. నిన్నూ నీభోగందాన్నీ డబ్బుకూడాఇచ్చి పోషించమంటావా? ఇంకా పెళ్ళికావలసిన చెల్లెళ్లు ఇద్దరున్నారు నీకు, నేను నీకుఎంతడబ్బు పంపగలననుకున్నావు? వాళ్ళిద్దరి పెళ్ళిళ్లుకూడా వదిలేసి నీభాగం ఎంతవస్తుందో అంతా నువు పంచుకోవటానికినాకు ఎటువంటి అభ్యంతరమున్నూ లేదు,' అని తండ్రి సమాధానం రాశాడు.

'ఆముసలి ప్రాణాన్ని ఎందుకు కష్టపెడతారు? మా అమ్మ దాచిపెట్టి నాకిచ్చినడబ్బు ఎనభైరూపాయలింకా నాదగ్గిరే వున్నై. అవి ఖర్చుపెట్టుతూ వుందాం. ఈలోపల మీరుమళ్లీ ఏదైనా వుద్యోగం చూడండి!' అన్నది మాణిక్యం.

ఆడబ్బు నెలాపదిహేనురోజుల్లో అయిపోయింది. ప్రకాశానికి వుద్యోగం దొరకలేదు. అసలు అతను ప్రయత్నమే చెయ్యలేదు.

‘పిచ్చిదానా, చేసినా వుద్యోగం దొరికేదికాదు. నామాట నమ్ము. ఈరోజుల్లో వుద్యోగమంటే మాటలా!’ అన్నాడతను.

మాణిక్యానికేమో కాస్తకష్టం వేసింది. ప్రకాశం అశ్రద్ధ ఆమెకు రుచించలేదు. కాని ఆవిషయమై మాణిక్యంచూసీ చూడనట్టు ఊరుకున్నది. పాపం ఆ ఎనభైరూపాయలూ సంవత్సరంనించీ ఎంతోభద్రంగా దాచిపెట్టింది. ప్రకాశంవాటిని గవ్వలల్లే మార్చి, అది మాణిక్యం ప్రాణపదంగా దాచుకున్న డబ్బని ఒక్కరవ్వయినా ఆలోచనలేకుండా, గోల్డుఫ్లేకుసిగిరెట్లకిందా, జట్కాబళ్లకిందా, సినమాలకిందా ఖర్చుపెట్టేశాడు.

తనమనస్సు చివుక్కుమనటం ఎందుకో మాణిక్యం అర్థంచేసుకోలేకపోయింది. ప్రకాశం తమయిద్దరికిందా దాపాపురెండువందలు ఖర్చుపెట్టాడు. తన ఎనభైరూపాయలు ఖర్చయితేఏం? తనమనసులో ఏకోశానో నీచత్వంవున్నదనుకుని మాణిక్యం సిగ్గుపడ్డది.

‘ఒక్కపని చేస్తాను!’ అన్నాడు ప్రకాశం. ‘గంగాధరరానికి రాస్తాను. నేనేదైనా ఏర్పాటు చేసుకునేదాకా వాడుమనకు కావలిసింది ఇస్తాడు!’

అనాడే ప్రకాశం గంగాధరరానికి ఒక కవరు రాసి పడేశాడు. అతనిదగ్గిర్నించికూడా మూడోనాటికే సమాధానంవచ్చింది.

‘రేపు సోమవారంనాడు నీపేర నూరురూపాయలు యిన్సూరుచేస్తూన్నాను. నువు ఇబ్బందిలో వున్నావని తెలిసినాకు చాలా కష్టంగా వుంది. రోజులు మనవి కానప్పుడు అంతా విరోధు లవుతారు—భగవంతుడుకూడా. ఈ డబ్బుజాగ్రత్తగా వాడుకుంటే హీనంగా రెండు నెలలవరకూ సరీపోతుంది’ అని రాశాడు గంగాధరం.

మర్నాడు వందరూపాయలూ వచ్చినై. ప్రకాశం వుత్సాహానికి మేరలేదు.

‘పిల్లా! ముందు ఒక గోల్డుఫ్లేకుపెట్టె తెప్పించు!... అదుగో, ఆబత్తాయికాయలు పిలు. రెండు డజన్లు పుచ్చుకుందాం!’

మాణిక్యానికి ప్రకాశం ప్రవర్తన వెగటుగా తోచింది. ఈసారి అతన్ని నిరసించటానికి తన నైచ్యంతో ఏమీ సంబంధంలేదు. ఆడబ్బు తనది కాదు. ఇంకొకరిడబ్బు ఖర్చుపెట్టేటప్పుడు ‘ఈడబ్బు మనదికాదే!’ అని కొంచెం వుంకూడదా? పాపం, ఆయన, ఆగంగాధరంగారు దేవుడల్లే సమయానికి అడ్డుపడ్డాడు కనక సరీపోయింది! లేకపోతే ఏపూట పస్తుపడుకోవలసివచ్చేదో!

మూడుసార్లుగా మూడువందలు పంపాడు గంగాధరం.

ప్రకాశానికి వుద్యోగం లభించనేలేదు—దానంతట అది!

గంగాధరానికి మళ్ళీడబ్బుకోసం రాయవలిసివస్తుందా ఏమిటి అని ప్రకాశం భయపడుతుండగా గంగాంధరందగ్గిర్నించి అందరికుండెలూ నీరుచెయ్యజాలిన వుత్తరం వచ్చింది.

‘ప్రకాశం—నా అజాగ్రత్త నా కొంప నిలువునాతీసేసింది. అకస్మాత్తుగా పొలాలధరలు పడిపోయినై. ఈ రోజున నాఆస్తికీ అప్పుకూ సరీపోతుంది. ఏనాడు నాకీముప్ఫైఅయిదురూపాయల వుద్యోగమూ ఊడిందో ఆనాడు నేను చిల్లిగవ్వకు మారను.

పాపం, నామీద ఇంతకాలమూఆధారపడి, వేరే దిక్కులేకుండావున్న మీరు ఏమవుతారు?—గంగాధరం’

ఆ వుత్తరం చదివి మాణిక్యం దుఃఖం ఆపుకోలేకపోయింది. తనకోసరంకాదు, ప్రకాశంకోసరమూ కాదు, ఆగంగాధరం కోసరం ఆమె హృదయం ద్రవించడం మొదలుపెట్టింది. ఆ సమయానికి ప్రకాశం ఇంట్లోలేడుకనక సరీపోయింది. పోతే తనదుఃఖం అర్థమయ్యేదికాదు. ఆ అర్థంవిప్పిచెప్పటం ఆమెకు

చాతనయ్యేదీ కాదు!

ఈ అమాయకుణ్ణి మాసి తను ఎట్లా దడుచుకుంది! అతని మొహమైనా తను స్పష్టంగా చూడలేదు.

గంగాధరం రాసిన వుత్తరం చూసికూడా ప్రకాశం డబ్బుకోసరం-ఒక్క పాతికకోసరం, కనీసం పదిహేనుకోసరం-వుత్తరం రాశాడు! అందులో ఒక బొంకుకూడా బొంకాడు, తనకు వుద్యోగం అయే లక్షణాలు కనిపిస్తున్నవని. ఆ వుత్తరంమాణిక్యం బలకంతాన చదివింది. 'ఇది నిజంగా పోస్టులో వేస్తారా?' అన్నది మాణిక్యం.

వారి జన్మల్లో మొదటిసారీ చివరసారీ ఆఉత్తరం గురించి కొస్తతీవ్రంగానే ఆ యిద్దరూ పోట్లాడుకున్నారు. అతను దాన్ని పోస్టులో వెయ్యటానికి వెళ్ళగానే ప్రకాశంపేర ఒక ఉత్తరంవచ్చింది. దాని మీది నల్లమరకలు మాణిక్యానికి అర్థంకాలేదు.

పోస్టాఫీసునుంచి తిరిగివచ్చి ప్రకాశం ఆవుత్తరం చించి చూసుకున్నాడు. కొంత చదివి అతను నిట్టూర్పువిడవటం మాణిక్యం గమనించింది. సాంతంగా చదివినతరవాత అతని కళ్ళలోకి ఒకవిధమైన వెలుతురూ తీర్మానమూ రావటంకూడా గమనించింది.

ఆ ఉత్తరంతెచ్చిన అశుభవార్త ఇదీ.

'మా అన్నయ్య నిన్నరాత్రి అకస్మాత్తుగా చనిపోయినాడు. చెట్టంత కొడుకుపోతే మా అమ్మా నాన్నా దుఃఖం పట్టలేకుండా ఉన్నారు. వాళ్లుఏడుస్తుంటే మేము చూడలేకుండా వున్నాము. వున్న ఒక కూతురూ ఇట్లాకావటం, ఒక కొడుకూ అట్లాకావటం ఇంతకూ వాళ్ళరోజులు మంచివికావు. మీరు నన్ను క్షమించినా క్షమించకపోయినా నేను మీవిషయంలో ఎంత బుద్ధిలేకుండా ప్రవర్తించానో తెలుసుకున్నాను. నావిషయం అట్లాఉండగా మా అమ్మా నాన్నలకు అల్లుడైనా కొడుకైనా ఇక మీరేకనక వాళ్ళయందైనా కరుణించి మీరు ఈ ఉత్తరం అందినవెంటనే రావలిసింది—సుందరి.'

మొదట్లో ప్రకాశం తనతండ్రిని గురించిన విషవార్త ఏమైనా ఉత్తరంలో ఉందేమోనని గాభరాపడిపోయినాడు. ఆసంశయం వెంటనే తీరిపోయింది. మిగతా ఉత్తరంలో తనకు శుభవార్తే. భార్య చిట్టచివరకు తనతప్పు ఒప్పుకోవలసినతీరుగా ఒప్పుకున్నది తన బావమరిది పోవటాన్నుంచి తను పదిహేనెకరాల సుక్షేత్రమైన యీనాం మాగాణీభూమికి హక్కుదారవుతాడు. ఇక తను ఉద్యోగం చూడవలసిన పీడకూడా వుండదు.

కాకపోతే మాణిక్యం విషయం! తీరికగా మాణిక్యంవిషయం ఏదో చెయ్యాలి. బహుశా మాణిక్యాన్ని తను వదలుకోవలిసి వస్తుందేమో! మళ్లా గౌరవనీయమైన సంఘంలోపడితే ఈతగలాటం తనకు ఎట్లా వీలవుతుంది? అయితే మంచిదే. కాకపోతే తను మాణిక్యాన్ని వదులుకోవలసి వస్తుంది!

'మా బావమరిది పోయినాడు. నేను అర్జంటుగా వెళాలి. నువు ఒక్కతెవూ ఉండలేవా? ఈపదిరోజులూ రావటానికి వీలుపడదేమో!'

'పాపం వెళ్ళిరండి!' అన్నది మాణిక్యం, అతని మీద తనకు అంతకుపూర్వమే కలిగిన కోపం యావత్తూ మరిచిపోయి.

ప్రకాశం వెళ్ళి ఇరవై రోజులు కావస్తున్నది. అతనిదగ్గిరనించి ఉత్తరంలెదు. అతను అసలె లేడు.

తన్ను ప్రకాశం వంచించాడనకోలేకపోయింది మాణిక్యం, ఒక చెంప తన అంతరాత్మ నొక్కి చెప్పతున్నా. ఆ ఆలోచన హృదయంలో పదే పదే తట్టుతుంటే, 'నేనింత నీచురాలనయి పోతున్నానేమిటి?' అనుకున్నది.

ఆమె కష్టాతే ప్రకాశం వెళ్ళి ఒకయుగం అయినట్టున్నది. ఇంటిముందుగా ఏబండివెళ్ళినా, గడపముందు యేమాత్రం అలికిడి అయినా ఆమె చెవులు రిక్కించి వినేది. వీధిలో ఎవరు ఎవరివాకిలి తట్టినా ప్రకాశంవచ్చి తనవాకిలి తట్టినట్టే అయేది. ఆమెకు తిండిమీదకూడా ధ్యాసలేకుండా పోయింది. ఒకపూట వండుకుంటే ఒకపూట వండుకోక అశ్రద్ధగా ఉండటం మొదలుపెట్టింది.

ఒకసారి నిజంగా ఎవరో తలుపుతటారు. ఎంతో

అనుర్ధాతో వెళ్ళి తలుపుతీసింది. ఇంటాయన అద్దె అడగటానికి వచ్చాడు. తాత్కాలికంగా వచ్చిన ప్రాణం కాస్తా నశించిపోయింది. ఆమె అప్పటికి భోంచేసి అరవై గడియలైంది—అదికూడా ఏంవేసుకుని తిన్నదో!

'వారు ఊళ్ళోలేరు. రాగానే ఇస్తారు!' అని చెప్పి ఇంటాయన్ని పంపేసి మాణిక్యం వంటచేసేటందుక్కూడా సత్తువలేక మంచంమీద ఒరిగింది.

సహం వళ్లు తెలిసీ సహం తెలియకుండా ఆమె మంచంమీద అట్లా పడుకుని, 'ఇదంతా నాకు ఆశడి మీద ప్రేమేమే?' అని ప్రశ్నించుకుని తనలోతను నవ్వుకుంది. ఆతరవాత ఆమెకు స్పృహ తప్పింది.

ఎవరో తన మంచందగ్గిర నిలబడ్డారు...లోపలికి ఎట్లావచ్చారో!...కళ్లు తెరిచి చూసేటందుక్కూడా ఓపికలేదు. మళ్ళీ మైకం వచ్చేసింది.

అకస్మాత్తుగా తన శరీరంలో జీవం ప్రవేశించినట్టయింది. కళ్లు తెరిచి చూడగలిగింది. ఆగంగాధరం! అతని చేతులో మంచినీళ్ళ గ్లాసుంది. ఆమె అప్రయత్నంగా నోరు తెరిచింది. అతను మరికాసిని నీళ్లు ఆమె నోట్లో పోశాడు. ఎండిపోయిన ఆమె గొంతుకా నీళ్లు అమృతంమాదిరిగా తగిలినై.

'బయటివాకిలి దగ్గిరిగా వేసిఉంది. నువ్వొటుల ఒళ్లు తెలియకుండా పడిఉన్నావు. ఏదో ప్రమాదం జరిగిం దనుకున్నాను.'

'ఇట్లా ఉంటుందా ఈయనగొంతు!' అనుకుంది మాణిక్యం అసందర్భంగా.

'వంటఇంట్లో ఎక్కడివక్కడ పారేసి ఉన్నై ...నువు వంటచేసుకుని ఎన్నిరోజులైందీ?'

'ఏమో, జ్ఞాపకంలేదు.'

'తిండిలేక శోషించింది...ఎందుకట్లచేశావు?'

'పొగరు! బద్ధకం!' ఆరెంటికీ చాలా దగ్గరబాంధవ్యమల్లే!

'నేను ఆవంటిల్లు కాస్తబాగుచేసి వంటచేస్తాను.'

'మీరా?'

'అవును. నేనే వంటచేసుకొంటాను. నాకు చేసిపెట్టేవాళ్ళెవరూ లేరు. హోటలుతిండి నాకు సరిపడదు.'

ఆమె మళ్ళీ కళ్ళు మూసుకున్నది. చక్కటి నిద్ర పట్టింది.

అతను మళ్ళీవచ్చేటప్పటికి ఆమె గాఢనిద్రలో ఉంది. ఆమెను ఎట్లులేపాలో అతనికి తెలియలేదు. 'ఇదుగో!' అని చూశాడు కాని లాభంలేకపోయింది. పైగా చచ్చిపోయిన తనభార్య జ్ఞాపకం వచ్చింది. ఇక పేరుపెట్టి పిలవక తప్పిందికాదు.

'మాణిక్యం?'

పిలుపు అనలేదు.

కొంచెం గట్టిగా 'మాణిక్యం!'

మాణిక్యం కళ్లు తెరిచి బలహీనంగా నవ్వి 'అంతపొడుగున నన్నెవ్వరూ పిలవరు! మణి అనండి చాలు' అన్నది.

'ఇదుగో ఇవి తినుముందు. తిని కాసిని నీళ్ళు తాగు. ఒక్కసారిగా భోంచేస్తే విషమిస్తుందేమో.'

'ఏమిటవి?'

'ఏదో తీపిసరుకు, హోటలునించి తెచ్చాను.'

'ఎందుకు పడుతున్నారండీ ఈఅవస్తఅంతాను.'

'ఎట్లామరి?'

మాణిక్యాన్ని గంగాధరం మంచంలోలేపి కూర్చోబెట్టవలసివచ్చింది. అతను తెచ్చిన పదార్థాలు తిని కాసిని మంచినీళ్లు తాగి మాణిక్యం 'ఇక నేనే మీ తినలేను. నాకు వంటచెయ్యకండి' అన్నది.

'వంట అయిపోయింది. సయించినంత తిను. నీయిష్టంవచ్చినప్పుడేకానీ' అన్నాడు గంగాధరం.

'చీకటిపడ్డట్టుంది. కొంచెం లాంతరు వెలిగించండి.' అతను లాంతరు వెలిగించాడు.

'మీరు భోంచెయ్యండి.'

'అప్పుడే తొందరలేదు. నీకుకూడా ఆకలికానీ.'

'అమ్మా! నాకిక తిండివద్దు. నేను తోడుకూర్చుంటాను. మీరు భోంచెయ్యండి.'

'నేను భోంచేస్తానులే. నువు తోడక్కర్లేదు. అప్పుడే నువు లేచి నిలబడగలవా?'

'ఓ' అంటూ మాణిక్యం లేచి నిలబడబోయి తూలి సమయానికి అతను అందించిన చెయ్యి పట్టుకుంది. 'నత్తువ మెల్లిగా వస్తున్నది.' అన్నది నిబ్బరంగా నడవాలని ప్రయత్నం చేస్తూ.

'అట్ల కాస్సేపు కుర్చీలో కూర్చో. నేను భోంచేసి వస్తానుపోనీ' అంటూ అతను ఆమెను ఒక ఈజీచైరులో కూర్చోబెట్టి తను ఒంటరిగా భోజనం చెయ్యబోయినాడు. కాని ఆమె అతని భోజనం పూర్తికాక పూర్వమే వంటఇంట్లోకి వచ్చింది.

'పోనీ నేనుకూడా కాస్త రుచిచూస్తాను మీ వంట,' అన్నది మాణిక్యం.

కాని ఆమెకు తిండి లోపలికిపోలేదు. ఇద్దరూ ఒక్కసారే భోజనం పూర్తిచేశారు.

'అవన్నీ అట్లా ఉంచండి. రేపు నేను బాగు చేస్తాను,' అని ఆమె అతన్ని నిర్బంధించింది.

ఇద్దరూ ఇవతలికివచ్చి చెరొక కుర్చీలోను కూర్చున్నారు. పడకకుర్చీలో తను కూర్చోవని మాణిక్యం మొండితనం చేసింది. అతనే దానిలో కూర్చున్నాడు.

ఇద్దరూ అయిదునిమిషాలు అట్లా మౌనంగా కూర్చున్నారు.

'నేను వచ్చి నాలుగైదు గంటలయినట్టుంది. నేను మోసుకొచ్చిన వార్త ఇంకా బయటపెట్టలేదు. నువ్వూ అడగలేదు ప్రకాశంసంగతి,' అన్నాడు గంగాధరం.

'శుభవార్తఅయితే మీరప్పుడే చెప్పేవారు. కాదేమోననే అడగకుండా ఊరుకున్నాను. ఎప్పుడైనా వినవలిసిందే! చెప్పండి,' అన్నది మాణిక్యం.

'ఈ ప్రకాశం నాకర్థంకావటంలేదు!' అన్నాడు గంగాధరం తనలోతను మాటలాడుకుంటున్నవాడల్లే. 'నేనువాణ్ణి బాగా ఎరుగుదుననుకున్నాను...ఎవరో అన్నట్టు, మనం ఎంతబాగా ఎరిగినమనిషిఅయినా ఆడదాని దగ్గిరికి వచ్చేటప్పటికి ఎట్లు ప్రవర్తించుతాడో చెప్పలేమన్నది నిజమేనేమో!...వాడికీ భార్యకూ చెడ్డది. తన తప్పేనని ఆ భార్యకూడా ఒప్పుకున్నది. తీరా విచారిస్తే ఏమీలేదూ! వట్టి చిన్నతనపుతగూ. తండ్రి నడిగి వెయ్యిరూపాయలు తనకిప్పించమన్నాడుట ప్రకాశం తన భార్యను. అది వరకు కట్నంరూపంగా తీసుకున్నది చాలదా అన్నదిట భార్య. ఆ భార్యను వదిలిపెట్టేశాడు! ఇప్పుడు మళ్ళీ నీ విషయంలో...అయితే మీ యిద్దరికీ మనస్సులు కలవలేదన్నాడు. నిజమా?'

ఈ మాటలన్నీ తలవంచుకుని వింటున్న మాణిక్యం తలయెత్తి, 'నాకు తెలిసినంతవరకు ఒక విషయంలోనే అట్లాజరిగింది. దేవుడివంటి ఒక స్నేహితుడితో ఆయనకు అబద్ధంఆడటానికి అభ్యంతరం లేకపోయింది, నా మనస్సుకది కష్టంగాతోచింది! అంతే మా యిద్దరికీ కలిగిన అభిప్రాయభేదం!'

'చూశావా?' అన్నాడు గంగాధరం, నేననుకున్నంతా అయిందన్నట్టు. 'తనూ భార్యా మళ్ళీ కలిసినసంగతి నీతోచెప్పమనీ, నీకు డబ్బుఏర్పాటు ఏదో చేస్తానని చెప్పమనీ, ఈలోపుగా ఎట్లాగైనా నాలుగురోజులు ఓర్చుకోమని చెప్పమనీనన్ను పంపించాడు. నీకు అర్జంటుగా కావాలంటే నన్నే ఏదైనా ఇవ్వమన్నాడు. నాదగ్గిర ఇరవైరూపాయలు మాత్రం ఉన్నై!'

'ఇంకా మామోహాన ఎంతడబ్బు పెడతారండీ! ఇప్పటికే మీసొమ్ము మూడువందలు తినివున్నాం. నా మెడలోవీ చేతులవీ నగలు రేపు అమ్మించేస్తాను. మీమూడువందలూ మీరు తీసుకోండి. ఆ తరవాత నన్నెవరూ పోషించ నక్కరలేదు. కధలో నక్కమాదిరిగా అందని పళ్ళకు అర్రులుచాచాను కాని నేను భోగందాన్ని కానా? నాకు నావృత్తిలేదా? రెండుసార్లు మోసపోయినాను. ఇంకొకసారి మోసపోతానా?'

మాణిక్యం పట్టలేక ఏడవటం మొదలుపెట్టింది.

'ఆడబ్బు నువ్వెందు కివ్వాలి? నేను ప్రకాశాన్ని చూసియిచ్చానా, నిన్నుచూశా? పైగా నేను అది తిరిగి పుచ్చుకోవాలని ఇవ్వలేదు. నాకా గడవకపోదు, నెలకు ఇరవైచాలు. నాజీతంలో పదిహేను రూపాయలు హీనంగా మిగుల్చుకోగలను. అదిగాక

అయిదురూపాయలు మాయింట్లోభాగానికి అద్దె కూడా వస్తుందీ!'

మాణిక్యం ఏడుపుమాత్రం మానలేదు.

'నువ్వట్లు ఏడవకు, మాణిక్యం, నేను చూడలేను!'

మాణిక్యం తనదుఃఖాన్ని దిగమింగి కళ్లు తుడుచుకుంటూ 'నిస్సత్తువచేత ఏడుపుకూడా స్వాధీనంలోకి రాకుండావుంది. లేకపోతే మీచేత అడిగించుకోను, ఏడుపుమానమని!' అన్నది.

బుద్ధితక్కువై ఏడుపు మానమన్నాననుకున్నాడు గంగాధరం.

రెండు మూడు నిమిషాలు ఇద్దరికీ ఏమిమాటలాడేటందుకూ లేక పోయింది.

'అదికూడాకాదు!' అన్నాడు గంగాధరం. 'నాకాశ్చర్యమేమిటంటే, ఆపేక్షలూ అంతఃకరణాలూ కర్మను అనుసరించి రావచ్చును, పోవచ్చును. అందుకు బుద్ధిమంతుడు సిగ్గుపడతాడా? తనకు నీమీద ఆపేక్ష కలిగింది! సిగ్గుపడ్డాడా? నీతో కాపరం చెయ్యలేదూ? ఆ ఆపేక్షపోయింది! నీతో ఆమాట స్వయంగా అనరాదూ? వుత్తరం రాయటానికూడా మొహం చెల్లదుట! నన్ను తరిమాడు. నేనప్పుడే అన్నా 'నీమనసులో ఏదోకల్మషంవుంది. లేకపోతే ఆమొహం చెల్లకపోవటమనేది కలగదు!' అని' అన్నాడు గంగాధరం.

'ఒకరిసంగతి ఎందుకులెండి. ఇందులో నాబుద్ధిపొరపాటు బోలెడుంది నాకులానికి తగినవృత్తీ, ఆ వృత్తికి తగిన విద్యా మానేసి, తగుదునమ్మా అని నేను ఇంగ్లీషు చదువుకు పోయినాను. ఆచదువులో పడ్డప్పటినించీ అందరిమాదిరిగా నేనుకూడా ఇల్లాలిని కావాలని, ప్రేమ అనుభవించాలని! నాకు బాగా దొరికాడు మామామయ్య. మాఅమ్మ ఏదోముల్లె పాతిపెట్టిందని ఆశపడి అతను పెళ్ళాడతానని అనీ అనీ, నన్ను తనదగ్గిర ఆరునెలలు అట్టేపెట్టుకుని, చివరకు మాఅమ్మ పాతిపెట్టినబండారం బయటపడగానే నాతోవ నన్ను చూసుకోమన్నాడు.

'మామామయ్యా ప్రకాశంగారూ పట్టణంలో కలిసి చదివారు కాలేజీచదువు. అప్పుడీయనకూ నాకూ కొద్దిగా పరిచయం. నేను పట్టణంనించి వస్తుండగా మధ్యస్టేషనులో నాపెట్టెలోకే ప్రకాశంగారు ఎక్కారు. నాకష్టాలన్నీ ఆయనతో మొరపెట్టుకున్నాను. ఆయన ముందూ వెనకా ఆలోచించకుండా 'మనిద్దరం పెళ్ళిచేసుకుందాం!' అన్నారు. నాకు ఆశపుట్టింది. ఆశపడ్డందుకు భగవంతుడు గట్టిగా చెంపలు వాయించాడు!'

మళ్ళీ అయిదారు నిమిషాలపాటు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు.

'అయితే నీముందు గతేమిటి?'

'దాన్నిగురించి ఇప్పుడాలోచించ బుద్ధి పుట్టటంలేదు. జీవితంలో ఒక్కొక్క సమయం వస్తుంది— అట్లు జీవితంయావత్తూ జరిగితే మనకు అభ్యంతరం వుండనవసరంలేని సమయం. ఇప్పుడటువంటి సమయం వచ్చింది. రేపు గురించి ఆలోచిస్తూ ఈక్షణం ఎందుకు పాడుచేసుకోవాలి? రేపు మీరు వెళ్ళినతరవాత నాముందుగతిని గురించి ఆలోచించటానికి బోలెడంత వ్యవధి వుంది!'

'ప్రకాశంసంగతి చెప్పగానే మండిపోతావనుకున్నాను...నాకింకా అర్థంకాలేదు. నువ్వు వాడికోసరమేగదా భోజనంకూడా మానేసి శోషించింది, వాడిసంగతి చెప్పగానే మొదలు నరికిన చెట్టల్లే ఎందుకు పడలేదో!'

'నేను అంతనిర్లక్ష్యం చేసింది ఆయనకోసం కాదు. ఆయన రారని వారంరోజులకిందటే రూఢి చేసుకున్నాను. జీవితంలో నేనుపెట్టుకున్న గురులు రెండూ ఈజీవితానికి లేకుండాపోయినై —పెళ్ళీ, ప్రేమా! జీవితంమీదే విరక్తిపుట్టింది!'

'మళ్ళీనేను వెళ్ళగానే ఈవిధంగానే భోజనం మానేసి పస్తుపడుకుంటావా ఏమిటి?'

'ఏం పడుకుంటే?' అన్నది మాణిక్యంనవ్వుతూ.

'అట్లుచెయ్యనని వాగ్దానం చెయ్యకపోతే నేనిక్కణ్ణించి వెళ్ళనే వెళ్ళను!'

'మీరు వెళ్ళకపోతే నాకభ్యంతరమునా? మీతో గడిపిన ఈ కాస్సేపూ వున్నట్టు నాజీవితంలో నా కెన్నడూ లేదనుకుంటాను!'

గంగాధరం ఆ మాటకు ఏంచెప్పాలో ఆలోచించకపోయినాడు. కాస్సేపు మాణిక్యంకేసి అలాగే చూస్తూ కూర్చుని అతను అకస్మాత్తుగా, 'ప్రకాశం తన మనస్సులో భావాన్ని పైకి ప్రకటించటానికి సిగ్గుపడ్డందుకు ఇంతకుముందే తప్పుపట్టి నా మనస్సులో భావం నేనెందుకు దాచిపెట్టాలి?...మాణిక్యం, నాకు భార్య వవుతావా?' అతని గొంతు కొంచెం చలించింది. 'నేను బీదవాణ్ణి నలభైరూపాయల మీద ఇద్దరుమనుష్యులు బతకవచ్చునేమో! అయినా కాలూ చెయ్యీ ఆడదు. నువ్వు సుఖానికి అలవాటు పడిన ప్రాణం కావచ్చును!–'

మాణిక్యం అతనిమాటలు అర్థంచేసుకోనట్టు అతనికేసి పెద్ద కళ్ళుచేసుకుని నిశ్చలంగా చూడటం మొదలు పెట్టింది.

'నేనా సుఖానికి అలవాటుపడిన ప్రాణిని!' అని అసందర్భంగా, 'నేను మిమ్మల్ని ఆకర్షించాలని ఏమైనా ప్రయత్నించేశానా— నాకు తెలియకుండా!' అన్నది మాణిక్యం.

గంగాధరం నవ్వాడు.

'నీ కటువంటి భయం ఏమీ అక్కర్లేదు నువ్వటువంటి ప్రయత్నంచేసినా నేను తెలుసుకోలేను. నేను రసికుణ్ణి కాను. నా భార్య ఎప్పుడూ ఆమాటే అనేది!'

'మీరిప్పుడు నన్ను మీ భార్యకమ్మనేనా అడిగారు?' అన్నది మాణిక్యం, దాదాపు కావాలని అడుగుతున్నట్టుగా.

అయితే ఆమె ఆశ్చర్యం అతనికి కృత్రిమంగా కనిపించలేదు. 'అవును!' అన్నాడతను.

'ఎందుకంటే, మొదట నేను వేశ్యను—మీ రెరుగుదురు! తరవాత నేను ఇద్దరికి ఉంపుడుకత్తెనుగా ఉన్నాను. రెండుసార్లూ నాభార్యాత్వం జయప్రదంకాలేదు...మళ్ళీ అరునెల్లు!' అన్నది మాణిక్యం అక్కడక్కడా ఇంగ్లీషుమాటలుకూడా ఉపయోగించి మాటలాడుతూ.

గంగాధరం కూర్చున్నచోటినించి లేచివచ్చి ఆమె చేతులు తనచేతుల్లోకి తీసుకొని 'కాదు, మాణిక్యం! నిన్ను నేను పెళ్ళిచేసుకుంటాను. ఎట్లాగో నేను నిన్నిట్లువిడిచిపెట్టి వెళ్ళలేను. నువ్వేమవుతున్నావో అని నా మనసు బాధిస్తూనేవుంటుంది,' అన్నాడు.

మాణిక్యం బలహీనంగా నవ్వి, 'ఆ దౌర్బల్యం మీలో లేకపోలేదు. అందుకనే నాలుగునెలలనుంచీ నన్నూ మీస్నేహితుణ్ణీకూడా పోషిస్తున్నారు. కడుపునకన్న పిల్లలమల్లే! నాకోసం మీరు జాలిపడటం నాకు సంతోషమే కానివ్వండి, నీకు అందువల్ల చాలా ముప్పున్నది. నావంటివాళ్ళు ప్రపంచంమీద కట్టుకుపోయినంతమంది వున్నారు. వాళ్ళందరికోసమూ మీరు'—అని ఏదోఅనబోతుండగా గంగాధరం కొంచెంవంగి ఆమె చెంప ముద్దుపెట్టుకున్నాడు.

'నాలో ఏంచూసి మీరు నన్ను ప్రేమిస్తున్నారో నాకర్థంకాలెదు,' అన్నది మాణిక్యం.

'నాకూ అర్థంకాలెదు, కాని తెలుసుకోవాలని నాకులేదు. అంతే మనిద్దరికీ భేదం.

'నాగుండె చూడు ఎట్లుకొట్టుకుంటున్నదో! అది అబద్ధంఆడుతుందా?'

మాణిక్యం అనుమానిస్తూ అతనిగుండెమీద చెయ్యివేసి 'అమ్మో!' అన్నది.

'ఇంకేమిటి నీఅనుమానం?'

'నన్ను మామూలు బోగందాన్ని వుంచుకున్నట్టే వుంచుకోండి. ఏంతకాలం ప్రాప్తంవుంటే అంతకాలం మీదగ్గిరవుంటాను. మీకు ఏక్షణాన మొహం మొత్తితే ఆక్షణాన—'

గంగాధరం మాణిక్యంమూతి అట్లాగే ముద్దుపెట్టుకున్నాడు అమిత గట్టిగా!

'నేను మోటువాడిని, నాకు నాజూకులు తెలియవు. నాయిష్టం వచ్చినట్టు మాటలాడకపోతే అట్లా శిక్షిస్తాను!'

మాణిక్యం అతని మెడచుట్టూ చేతులు వేసి, 'పది

నిమిషాల కిందట ఎంతగౌరవంగావున్నాం! ఇంతలో ఇట్లా కావటానికి కారణంఎవరు? అతప్పెవరిది?' అన్నది.

'నాదే!' అన్నాడు గంగాధరం గర్వంగా.

'సరేకాని ఈపని ఆనాడు నేను మీకు తలుపు తెరచినప్పుడే ఎందుకు చెయ్యకపోయినారు?'

'ఏపనీ?'

'తలుపుతెరిచి మీరు కనిపించగానే ఎందుకో నాకు పుట్టెడు భయంవేసింది—అమాంతం నన్ను పట్టుకుని ముద్దుపెట్టుకుంటారనే! ఆపడ ఎంతసేపటి దాకానో పోలేదు! ప్రకాశంగారు కనిపెట్టారు కూడానూ!'

'ఛా!'

'ఒట్టండీ! నేను ఎప్పుడూ ఊహించుకుంటూ వుండేదాన్ని నన్నెవరో బలవంతంగా పట్టుకుని ముద్దుపెట్టుకున్నట్టూ నాకిష్టమైకూడా నేను పెనుగులాడినట్టూ! ఎందుకో చెప్పలేనుకాని మిమ్మల్ని చూడగానే నేను ఎప్పుడూ తలుచుకుంటూవుండిన మనిషి మీరేననిపించింది. ఇన్నిరోజులూకూడా నేను రహస్యంగా మీమనిషిని అయినట్టే! ఆపెద్దరహస్యం ఎవరికీతెలియకుండా దాస్తున్నట్టు ఖీలవుతున్నాను ...ఇప్పుడారహస్యం నీకు తెసిలిపోయింది!'

గంగాధరం చప్పునగంభీరుడై పోయినాడు.

'ఇదంతాకలే! ఎప్పుడో కళ్లుతెరిచేటప్పటికి నువ్వుండవు. కాని చాలా అందమైనకల!' అన్నాడతను.

'ఏప్రతిజ్ఞ అయినా మగవాళ్ళకు చెల్లిపోతుంది. మీరు మీమనస్సులో వున్నది బయటపెట్టుతానని ప్రతిజ్ఞచేసి నెగ్గించుకున్నారు. నేను మళ్ళీ ఇటువంటిపని చెయ్యననుకుని చెయ్యటానికి సంసిద్ధురాలను అవుతూన్నాను. ఆడజన్మలు వెధవజన్మలు. అంతరాత్మ అనేదివున్న ఆడదానికి సుఖంలేదు. నాకు మధ్య మధ్య స్వేచ్ఛగా నవ్వుదామన్నంత వుల్సాహం వస్తుంది ఎందుకానవ్వు అని అడుగుతుంది అంతరాత్మ. నామనస్సు ప్రేమతోనిండి పొర్లిపోతున్నది అంటుందినాబోటి ఆడది. ప్రేమతో నిండకేంచేస్తుందిలే, నీకూడూనీగుడ్డా సంపాదించిపెట్టేటందుకు ఎవరినో ఒకర్ని సంపాదించుకున్నాక! అంటుంది అంతరాత్మ!' అంటూ మాణిక్యంసన్నగా నిట్టూర్చింది.

గంగాధరం ఆమెవంక దీనంగా చూస్తూ, 'నువ్వట్ల అనుకుంటున్నావా?' అన్నాడు.

మాణిక్యం నవ్వి 'నేనంటే నేనుకాదు. మీరు ముద్దుపెట్టుకోగానే నావళ్లు బంగారమయింది. మీరు ప్రేమించేటప్పటికి నేను దేవతనై పోయినాను!' అన్నది.

[నూతనముగా ప్రచురింపబడిన కారుణ్యం అను కథల సంపుటమునుండి.]



# సంభోగమర్మములు

రచయిత:

పండిత ములుగు రామలింగయ్య

[సురతకాంక్ష జీవకోటికి సహజము. ఆరోగ్యవంతులగు గృహస్థులు నియమప్రకారము సాంగత్యము జరుపనియెడల మేహరోగము, మేదోరోగముగలిగి శరీరమునకు శిధిలత్వమును గలిగించుకొనెదరుగాన నిత్యాభ్యంగ శీలురును; నలుగుపెట్టుకొని స్నానముచేయు నభ్యాసముగలవారును, జీర్ణశక్తికలిగి వాజీకరణరూపములైన ఆహారమగు పాలు, పంచదార, సద్యోఘృతము, మినపగారెలు మొదలగువానిని భుజించువారునుఅగు పురుషులు 20 నుండి 80 సంవత్సరములవరకును స్త్రీలు 15 వత్సరములపైనుండి [స్త్రీ 16 వత్సరములవరకు బాలయనియు; 32 సంవత్సరములవరకు తరుణీయనియు; 50 వత్సరములవరకు ప్రౌఢయనియు; అటుపైన రతియందుత్సాహము తగ్గిపోవును గనుక వృద్ధా యనియు వ్యవహరించబడును.] 50 వత్సరములవరకును దాంపత్యధర్మమునందు ప్రవర్తించుట విధయై యున్నది.

రతికి రాత్రియే అనుకూలమైనది. ఆరాత్రియందును రతికాలనియమమునుగూర్చి ప్రత్యేకముగ తెలియవలసియున్నది. అహోరాత్రములందు త్రిదోషములనుబట్టి మనవారు కాల విభాగములను జేసియున్నారు. పగలు 3 భాగములు. మొదటిభాగము 10 గడియలు లేక 4 గంటలకాలము. కఫప్రకోపసమయము రెండవభాగము 20 గడియలవరకు. పిత్తప్రకోపసమయము. మూడవభాగము అస్తమానమువరకు. వాతప్రకోపసమయము. అటులనే రాత్రి 3 భాగములుచేసిరి. ప్రథమకాలమగు 10 గడియలరాత్రివరకు కఫకాలము. కఫకాలమే సాంగత్యమునకు హితవని మనవైద్యులు చెప్పిరి. రెండవభాగము రాత్రి 20 గడియలవరకు. అప్పుడు పిత్తప్రకోపముగ నుండును. మూడవభాగము వాతప్రకోపముగనుండును. కాన అర్ధరాత్రియందును తెల్లవారుజామునందును కలిసినయెడల వాతపిత్తప్రకోపదోషముచేత దంపతులు రోగములపాలగుదురు. ప్రత్యక్షముగ నప్పుడే హానితెలియదుగాన వయస్కులు లక్ష్యముచేయరు. కాని కొద్ది దినములలో తత్ప్రతిఫలమనుభవింతురు. కాబట్టి రాత్రి 10 గడియలలోపుగ నొక్కమారు కలియుట నారోగ్యప్రదము, ఆయుష్యప్రదము.

ఇచ్చట రాత్రిభోజనసమయ మెప్పుడనియు, భోజనానంతర మెంతతడవుండి సాంగత్యమునకై ప్రయత్నించవలయుననియు తెలియవలసియున్నది. భోజనము మొదటిజాములోపునచేసి ఒక గంటకాలమైనతరువాత దాంపత్యధర్మమందు ప్రవర్తించవచ్చుననిరి. మరియు ఋతుభేదములనుబట్టియు కొన్ని నియమముల నేర్పరచిరి. అవియెటులనిన: వసంతఋతువు కఫప్రకోపముగలదైనను సూర్యతాపమెక్కువగుచుండు కారణమున కఫబలము తగ్గునుకాన 3 దినములకొకతూరియు, శర

త్కాలమందు పిత్తము ప్రకోపించి శరీరమున వేడిజేయుచు కఫబలమును తగ్గించునుగాన 3 దినముల కొకసారియు, గ్రీష్మకాలమందు సూర్యతాపముచేత భూమి పరితపింపబడి జీవకోటి శోషించుచున్న కారణమున పైన చెప్పబడినట్లు నిత్యాభ్యంగాదులచే తుష్టింజెందుచున్నవారికే ఆయుఃక్షయభయముచేత 15 దినముల కొకమారును, వర్షాకాలమందు వాతము ప్రకోపించియు పిత్తము సంచయావస్థంజెందియు భూమి గ్రీష్మతాపముచేత పరితపింపబడి వెంటనే వర్షములుబడి భూమిలోని యావిరిఅంతయు బైలువెడలి మనుష్యుల శరీరమందు ప్రవేశించి యనేకరోగములను కలిగించుటచే శరీరములకు బలము తగ్గుచుండును కాన దేశకాలపాత్రములను కనిపెట్టి 15 దినముల కొక్కపర్యాయమును దాంపత్యధర్మమును విధించిరి. స్త్రీపురుషుల వయోభేదములచేత సాంగత్యమందు హానివృద్ధులు కలుగుచున్నవి. ఎటులనిన : స్త్రీ వయస్సు చాల తగ్గియుండి పురుషునివయస్సు మిగులుగనుండిన పురుషునకు బలోత్సాహములు వృద్ధియగును. పురుషునివయస్సు చాల తక్కువగనుండి స్త్రీవయస్సు మించియున్న యెడల పురుషుడు క్షీణించిపోవును. స్త్రీకి బలోత్సాహములు కలిగియుండును. పురుషుడవశుడై మరియొకస్త్రీని కలియవలసివచ్చిన యెడల తనకంటె చిన్నవయసుగలది, పరిచయముగలది, సరసురాలు అయినదానినే చేపట్టవలెను. తనకంటె పెద్దది, గర్భవతి, రోగముగలది, పరిచయములేనిది, శత్రుకోటిలోచేరినది, రజస్వల, చిరకాలమునుంచి బ్రహ్మచర్యములోనున్నది, దేశభేద జాతిభేద ప్రకృత్యాహారభేదముగలది మొదలగు నిషిద్ధకోటిలో చేరినదానితో సాంగత్యము ప్రాణమానములకు హానిందెచ్చును.

గర్భిణీవిహారములో దాంపత్యధర్మము నిషిద్ధము. "ఆహారనిద్రా భయమైథునంచ సమానమేతత్ పశుభిః నరాణాం। జ్ఞానోహి తేషా మధికోవిశేషో జ్ఞానేనహీనాః పశుభిః సమానాః॥" అనగా ఆహారనిద్రాభయమైథునములు పశువులకును నరులకును సమానమనియు- మనుష్యులకు జ్ఞానమొక్కటి అధికమనియు- అట్టి జ్ఞానములేని మనుష్యులు పశువులతో సమానమనియు చెప్పిరి. పశువులు కలిసినపిమ్మట గర్భవతియైనట్లు తెలిసికొని ఈని తిరిగి ఎదవచ్చినప్పుడుమాత్రమే కలియును. మనుష్యులలో ఈనీతిలేదు. ఈ విషయమై పశువులే మనుష్యులకంటె జ్ఞానవంతములై యున్నవి.

శయ్యాగృహమం దుత్సాహమును పుట్టించు దేవతాపటములు, చక్రవర్తుల పటములు నుండవలెను. భయంకరమూర్తుల పటములుండరాదు. దాంపత్యధర్మసమయమందు భయంకరమైన వాక్యములు, దుఃఖకరమైన వార్తలు వినబడకూడదు. దంపతులు సుగంధద్రవ్యముల నుపయోగించుకొనవలెను.

దాంపత్యధర్మానంతరకృత్యములు : మర్మస్థానములను సుఖోష్ణోదకముతో రహస్యస్థలమందు ప్రక్షాళనముచేసికొని, వసతిగలవారు సుఖోష్ణోదకముతో స్నానముచేసి, శుభ్రవస్త్రములను ధరించి, వెంటనే కస్తూరి కుంకుమపువ్వు పచ్చకర్పూరము మంచిగంధములో కలిపి శరీరములకు పూసికొని, ధాతువృద్ధికరములగు పంచదారతోచేసిన భక్ష్యములను-పానకములను-పటికిబెల్లముకలిపి కాచిన ఆవుపాలను- సంస్కరించిన మాంసరసమును జీర్ణశక్తి ననుసరించి సేవించవలెను. సుఖమైనగాలి వచ్చుస్థలమందు శయనించి నిద్రించవలెను.

నేషనల్ మూవీటోను వారి పౌరాణిక చిత్రము

# MOHINI RUKMANGADA

మే నెలలో యీదిగువ ప్రదేశములందు విడుదల కానున్నది.

బెజవాడ, బెంగుళూరు, శికిందిరాబాద్, గుంటూరు, నెల్లూరు, కాకినాడ, వైజాగ్, బందరు.

నటులు :

గగ్గయ్య,
సూర్యనారాయణ,
రామక్రిష్ణశాస్త్రి,
చలపతిరావు,
పరబ్రహ్మశాస్త్రి.



నటీనీలు :

రామతిలకం,
కృష్ణవేణి,
దుర్గాకుమారి,
సరస్వతి,
హేమలత.

కవి :
తాపీ ధర్మారావు.

కవి :
చి. నరశింహారావు.

దర్శకులు:
చిత్రపు నరసింహారావు.

సహాయులు:
చిత్రపు నారాయణమూర్తి.

వివరములకు :

## నేషనల్ మూవీటోను కంపెనీ లిమిటెడ్

స్టూడియోస్ :
71, పూనమల్లి హైరోడ్, కీల్‌పాక్, మద్రాసు.

కార్యస్థానము :
55, ఆర్మీనియన్ వీధి, మద్రాసు.

# 40 ఔన్సుల నెత్తురు

40 ఔన్సుల రక్తమునుండి కాని ఒక ఔన్సు శుక్లము ఉత్పత్తి కాదని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. దీనినిబట్టి శుక్లము ఎంత విలువ యైనదో తెలిసికొనవచ్చును. అట్టి శుక్లము మూత్రములోగాని, స్వప్నములోగాని పోవుచున్నచో ఇక పురుషునకు ఇహలోక సుఖమెక్కడ ? కాబట్టి సుఖానందములపై దృష్టియున్నచో

## శుక్లనష్టమును

ఎంతమాత్రమును అశ్రద్ధచేయక వెంటనే చికిత్సచేసి శుక్లరక్షణము గావించుకొనవలయును. పలుచబడిన వీర్యమును గట్టిపఱచి అమితముగా వీర్యవృద్ధిని కలిగించు వనమూలికలకు రాజైన రత్నపురుష ప్రధానద్రవ్యముగా చేయబడిన

# రత్నపురుషలేహ్యము

క్రమముగా సేవించుటచే తప్పక శుక్లరక్షణము జరుగును. మరియు ఈరత్నపురుషలేహ్యాసేవనమువలన

| | | |
|---|---|---|
| కండపుష్టి | : | కాయపుష్టి |
| బలము | : | ఆరోగ్యము |
| శరీరబింకం | : | జీవితసౌఖ్యం |

పొందుదురు. రత్నపురుషతో అమోఘవీర్యములగు పెక్కు ఇతర వనమూలికలుచేర్చి తయారుచేయబడిన తియ్యని రసాయనము. శుక్లనష్టమును నూటికి కుదుర్చు మధురమగు మందు. మేహరోగుల పాలిటి వరప్రసాదము.

నెలకు ఒక పౌను. వెల రూ. 3-0-0. తపాలాఖర్చులు ప్రత్యేకము.

రత్నపురుషడిపో,

2/40 పెద్దినాయునివీధి,

మదరాసు.



# నరమాంసభక్షులు

రచయిత:

శ్రీ గిడ్రాజు రామారావు

"బూచాడొస్తున్నాడు బైటికిపోకురా" అంటారు, ఈబూచాడెవడు, పిల్లలతో వానికేమిపని? ఇటువంటిసామెతలు ప్రతిదేశంలోను ఉన్నవి. పాతపాటలలోకూడ పిల్లలనెత్తుకొనిపోయి వండుకొని తింటారని తెలుస్తూవున్నది. ఇవియన్నియు కల్పితములా లేక సత్యములా? ఒకప్పు డాచారములోలేనిదే సామెతయై నిలచియుండునా? కాని మానవుడు మానవునితినుట అనిన అసహ్యముగాను ఆశ్చర్యముగాను తోచకమానదు. అయినను మనసంగతి మనము తెలిసికొనటలో తప్పులేదు. ఈవిధమైన ప్రీతిభోజనము 'పాషాణయుగము' లో ఆచారముగనేయున్నది. పిమ్మట కాలము మారినకొలది, ధర్మములు మారినకొలది, ఆచారములుమారినవి. సూచనలుమాత్రము ఇప్పుడుకూడ కనుపించుచునేయున్నవి.

మానవుడు సహజముగ రక్తప్రియుడని యే వైజ్ఞానికులయభిప్రాయము. ఇందులకు కారణము మానవులుకూడ ఒకప్పు డడవిజాతిజంతువులేకదా! భక్ష్యాభక్ష్య నియమము లేర్పడినతరువాత దీనిలోకూడ కొన్నిమార్పులుగలిగినవి. నియమము లేర్పరచినప్పుడు వ్యతిరేకులుకూడ ఉండుట సహజము. ఈ కారణముచేతనే ఒక జంతువును సహించువాడు మరియొకజంతువు నసహ్యించుకొనును. పందినితిననివాడు గోవును తినును. గోహత్యపాపమనువాడు కణుజును తినును. కాకి నసహ్యించుకొనువాడు గువ్వను తినును. ఇదేవిధముగా జంతువులలోకూడ భేదములున్నవి. వానికి నియమములెవ్వరేర్పరచిరో తెలియదు. కొన్నిజంతువులు తమజాతిజంతువులను తప్ప నితరములను ముట్టుకొనవు. కొన్ని తమజాతినేముట్టుకొనవు. ఈ నియమమును మానవులప్పటీసికొన్నారుగాని చంచలతగలిగిన మానవస్వభావ మూరుకొనదు. తినకపోయినను తినినంతపనిచేయుచున్నారు.

మానవులకుబుద్ధి మనుష్యులను చంపితినునప్పుడు మాయమైనదాయనిప్రశ్న. లేదు. వారు మానవజీవితమొక్క మహత్త్వమైనదిగా తలంపరు. మానవహత్యవారి ధర్మశాస్త్రము ఒప్పుకొనుచున్నది. నరమేధయజ్ఞము–మానవ బలిదానము భారతకాలమువరకు మనదేశమునగూడ సాగుచునేయుండెను బలిదానము నేడుకూడ మూలమూలల జరుగుచునేయున్నది. చేతనైనవారు దేవతపేరుపెట్టుకొనియో, లేక భూమిలో దాగియున్నలక్ష్మిని ఆహ్వానించుటకో మానవరక్తమును ప్రవహింపజేయుచున్నారు. చేతగానివారు శుభకార్యములముందు ఎర్రనిబట్టలు కట్టుకొనియో లేక కత్తితీసికొని ఎదుటి యరటిచెట్టును నరకియో, అదియుగాని చోపిండిబొమ్మనుచేసి ఆహుతిగాపడవేయుటో మొదలగు తమాషాలు చూపుచున్నారు. అంతరార్థము అందరికీ తెలియును. ఇట్టిమార్పులు కలిగినది భారతరచనా కాలమునందే. కాని ప్రయత్నములంతకు పూర్వమునుండియు జరుగుచునేయుండెను.

ఆయుగములో మానవవేటఅనునది ఒక దినచర్య. బల్లెములుతీసికొని కొంతమంది చేప

లుపట్టుటకు పోవునట్లు పోవుచుండెడివారు. ఇంటివద్ద స్త్రీలు, పిల్లలు వారి సుభాగమనమునకై ఎదురుచూచుచుందురు. • ప్రాణమున్న మనుష్యుడు చేతికిలభించినచో వారికి పరమానందము. ఆ నాడందరునుగలసి నాట్యమాడుదురు. ప్రతిదినము ఆ రాక్షసులయిండ్లలో ప్రీతిభోజనములు, అనగా విందులు జరుగుచునే యుండును. ఇట్టి రాక్షసులు ప్రపంచమంతటను గలరు. మన భారతదేశములోని పురాణ గాథలలో వేనవేలుకథలు లభించుచున్నవి. ఆఫ్రికావాసులు మనకు దగ్గరబంధువులే. ఆర్యులని విఱ్ఱవీగు జర్మనీవారి పూర్వులుకూడ నరమాంస భక్షకులనియు, ఇప్పటికిని అస్థిపంజరములు వ్రేలాడదీసినగృహాలు, కొన్ని పనిముట్లు, వానినిబట్టి వారివారి యాచారములు పరిశోధనవలన తెలిసికొనుచున్నారు. భారతదేశమునుబట్టి చుట్టుప్రక్కల ద్వీపములలో విరివిగాప్రాకినది. ఆయాచారము లిప్పటికిని పోలేదు. ఆఫ్రికాలోనూపోలేదు. యూరోపులో నేడుజరుగుచున్న అల్లకల్లోలము రాక్షసత్వముకంటె తక్కువా? ఇకతినుట మాట. యోగులనియనుపించుకొను పాషండులు నరమాంసమును తినుచుందురని మనకు తెలియును. మానవపుఱ్ఱెముకలను మెడలో ధరించు కొండజాతివారు మనలోనున్నారు. పుఱ్ఱెలను ఇండ్లకువ్రేలాడదీయు ఆచారము ఇతరదేశములలో ప్రాచీనజాతులలో కలదు. వారియిండ్లకు అతిథులెక్కువగా వత్తురు. ఎందులకో? ఆస్ట్రేలియాలో ఆదిమవాసులు కొందరుస్త్రీలు తమతమ పిల్లలను తినివేయుదురు. వారి కితరుల మాంసము లభింపక పోవుటచే యీమార్పుకలిగి యుండవచ్చును. ఆఫ్రికాలోనున్న అడవిజాతివారి కున్నంతస్వాతంత్ర్యము మనచమరులకులేదు. అందువలన వారు నరమాంసభక్షణ క్రమేణవదలి జంతు మాంసముమీదనే యాధారపడి యున్నారు. ఆర్యులురాక పూర్వము భారతదేశమున నున్న యడవిజాతులవారిలో యీయాచారము బాగుగాసాగుచుండెను కాని నాగ, అప్సరజాతులవారు కొంతవరకు బుద్ధివికాసముగలవారై యుండిరి.

పాలియోలిథిక్ యుగములో మానవులందరును నరభక్షకులనియేపురాతత్త్వవేత్తలు నిర్వచించియున్నారు. ముఖ్యముగా ఫ్రాంసుదేశమునకు దక్షిణముగా నున్న ప్రాంతములవారీ జాతివారని తెలిసికొనియున్నారు. వారుమానవ చర్మములను, అస్థిపంజరములను జాగ్రత్తగా దాచియుంచుటచే ఆధారములు లభించుచున్నవి. ప్రాచీన పాషాణయుగమునుండి నవీనపాషాణయుగమువరకు మానవవేట నిరాఘాటముగా సాగుచుండెను.

అర్టిమిసియా యనువాడు మసూల్ అను రాజును తగులబెట్టినపిమ్మట భస్మమునుతిని వేసెనట. ప్రేమచేత భస్మమునకు తగుమర్యాదనొసంగుట మనలోకూడనున్నది. గ్రీకుల చరిత్రలలో మానవవేటను గూర్చిన చారిత్రాత్మక విషయములు కనుపించును.

హిరోడోటస్ వ్రాసిన సిథియనుల చరిత్రలో జంతువులతోపాటు ముసలిమనుష్యులను గూడ చంపుచుండెడివారట. చంపబడినవారు చాల అదృష్టవంతులు. ఎసండనీజ్ జాతిని గూర్చి స్ట్రోబో వ్రాయుచు వారు భాగ్యవంతులనే వేటాడుదురని వ్రాసెను. పుఱ్ఱెలతో మంచినీరు త్రాగుదురట! ఇది ప్రాచీన స్విర్జ్లాండులోని సంగతి.

మధ్య ఆఫ్రికాలో నరభక్షకులసంఖ్య అధికము. పడమటి ఆఫ్రికాలోకొందరు వ్యాఘ్రరూపమునుదాల్చి మనుష్యులనుబట్టి తినుచుందురు. అట్టివారిని పాశ్చాత్యులుబట్టి ఖైదీలుగా గొంపోవుచున్నారు. ఆసియా, ఆస్ట్రేలి

యా న్యూజిలాండు ఉత్తరదక్షిణ అమెరికాలలో కొన్నిభాగములం దీ నరఘాతకు లున్నారు. గయానా మొదలు కాంగోవరకును, నైగ్రేరియాలోను నరమాంసభక్షకు లున్నారు. హయాతియనువాడు నరమాంసమును రకరకములుగా వండించి తినుచుండెడివాడట! బటోకుడో అను దక్షిణఅమెరికాలోని జాతి వారికి ముఖ్యాభరణము నరులయెముకల పూసలు. పపూఆ, మలనేసియా, అండమాను దీవులలోనివారు నరమాంసమును తినుచుండెడివారు. అండమానులో మనుష్యుని భస్మము నెత్తుకొనిపోవు ఆచారమిప్పుడు కూడ కలదు. పపూఆలో డయాక్‌లనువారు నరమాంసభక్షణలో ప్రసిద్ధులు. సాండ్విచ్చిద్వీపములో రాజు సింహాసనమధిష్టింప బోవునప్పుడు మనుష్యుని కంటినొకదానిని ఆరగించును. ఇందువలన నతనికి ఆయుర్వృద్ధియగునట. బెళ్ళారిజిల్లాలో ఒకజాతి బ్రాహ్మణవితంతులు అతిథులను మృత్యుదేవత కాహుతిగానిత్తురు. ఇయ్యది నేడు ధైర్యముతో చేయజాలరు కాబట్టి అయిదారుమాసములలో కృశించికృశించునట్లు మందు పెట్టుదురట. ఇందువలన ముందు జన్మలో వారిభర్తలు మరణింపవాని ఆయువు శేషమును కలిపికొని జీవించునట. ఈయాచారముగూడ ఇప్పుడు తగ్గుచున్నది. మేరీలు అను వారు పరాజితులైన శత్రువుల సర్దారునుబట్టి తినివేయుదురు. మన భీముడు రక్తమును త్రాగినట్లు నకులుడు తండ్రికాలినితినినట్లు ఆస్ట్రేలియాలో యుద్ధమునకుబోవుటకు పూర్వము వీరులు నరమాంసమును తిందురు. అది లభింపనిచో ఒకరిరక్తము మరియొకరు త్రాగుదురు. దీనివలన వారికి శౌర్యమెక్కువగునట. నరభక్షణములేక నరరక్తమువలన నపూంసకత్వముపోవునని నేటికిని ఒకవిశ్వాసమున్నది. చీనా యూరోపు ప్రాంతములలో దీనిని ఔషధప్రాయముగా వాడుచున్న విషయము మనకు తెలియును. ఈవిధముగా ప్రాచీనకాలమునుండియు నేటివరకును ఏదో విధముగా నీయాచారము ప్రోత్సహింపబడుచునేయున్నది. ప్రపంచమంతటను. " ఓం శ్శాంతి శ్శాంతిః "

# నటకులూ, చిత్రాలూ

మొన్న మొన్నటిదాకా వేషాలు వేసుకుని జీవించేవారిని సంఘం ఎంతలోకువగా చూస్తూవచ్చిందో మన అందరికీ తెలుసు. ఆసుదినాలు వెళ్ళిపోయినై. మళ్ళీరావు. ఈమధ్యనే కొందరు నాట్యకళాపోషకులు బయలుదేరి నటనావృత్తికి అస్పృశ్యతపోగొట్టారు. వీరు నాట్యకళకుగాని నటకులకుగాని సంఘానికిగాని ఎటువంటి ఉపకారమూ చెయ్యకపోగా బోలెడంత హానికలిగించారు. ఈ అపకారం చేసినందుకు ఆ నాట్యకళాపోషకులకు సంఘం పేరు ప్రఖ్యాతులిచ్చి గౌరవనీయులనుగా చేసింది. మొత్తంమీద వాళ్ళపని ఇవాళచాలా బాగుంది.

మానవతత్వం ఎటువంటిదంటే, మనిషి దాదాపు ఏ ఆచారానికైనా అలవాటుపడిపోతాడు. మనం చిన్నతనంనించీ చేస్తూ వస్తున్న పనులు ఎంత హాస్యాస్పదమైనవైనప్పటికీ మనకు వాటిల్లోఉన్న రోహ్యాత మనకు కనిపించదు. ఎవడైనా చూడగలిగితే వాణ్ణి రివోల్యూషనరీ అనేస్తాం.

అయితే నటకులవిషయం ఒకటి చూడండి, పెద్దమనిషి, గౌరవనీయుడైనవాడు, మొహానికి రంగుమెత్తుకుని, నెత్తికి టోపా పెట్టుకుని, అసహజమైన దుస్తులుధరించి, ఏడవటమూ, నవ్వటమూ, కోపించటమూ, ప్రేమించటమూ మొదలైనవి చెయ్యటానికి ఒప్పుకుంటాడా? సిగ్గుపడడా? చాటుగా మన ఇంట్లోనూ, అందరూ చూచేటట్లు వీధిలోనూ చెయ్యటానికి సిగ్గుపడేపని నాటకరంగంమీద ఎందుకు చెయ్యాలి? నాటకం రంగం అనగానే సిగ్గు బిడియాలు వదిలివెయ్యవచ్చుననా? ప్రతి నటకుడూ చేస్తున్నపనేమిటి? కొందరు స్త్రీపాత్రలుకూడా ధరించి, చీరలుకట్టి, పూలుపెట్టుకుని కులకటంకూడా చేస్తున్నారే! ఇటువంటి ప్రవర్తనను సమర్థించటం ఎట్లా? సాటిమానవుణ్ణి తక్కువచేసి చూడటం నాకూ కష్టంగానేఉంది. అయితే ఉన్న పరిస్థితులు ఇవీ! దేశంలోఉన్న కళాపోషకులకుగాని విమర్శకులకుగాని ఈమాత్రం తట్టినట్టు కనపడదు. నాకు తట్టినందుకు నన్ను రివోల్యూషనరీ అని తిట్టకుండానూ ఉండదులోకం.

అయితే నాటకాలు ఆడవద్దనీ, నటించవద్దనీ నా అభిప్రాయంకాదు. ఎందుచేతనంటే, ఈదృష్టితో చూస్తే అన్నికళలూ అడుగంటవలిసే వస్తుంది. కథారచనకూడా అంతే. ఒక నాయకుణ్ణీ నాయకురాలినీ కల్పించి, వారిద్దరూ ఒకరినొకరు ప్రేమించుకున్నట్టూ, వారిద్దరూ కలిసి కష్టాలపాలయినట్టూ, చిట్టచివరకు కష్టాలన్నీ గట్టెక్కి అంతా సుఖంగాఉన్నట్టూ లేనిపోని అబద్ధాలు కల్పించి, సాక్షాత్తూ చూసినట్టే పరమగోప్యమైన విషయాలూ, హృదయాలలో ఉన్న రహస్యభావాలూ వివరంగా వర్ణించటం కూడా సరిఅయిన దృష్టితోచూసేవాడికి హాస్యాస్పదంగానే ఉంటుంది. అయితే మనమంతా అట్లా భావించకపోవటానికి కారణం, నేను మొదట చెప్పినట్టు, మనం ఈ నటనకు అలవాటుపడిపోవటమే.

ఈ లెక్కప్రకారం కళలన్నీ నశించిపోవాలని శాసించటంకూడా కుదరదు. కనక ఈ ప్రవర్తనను సమర్థించటానికి ఏదైనాఉందా అని ఆలోచించాలి. ఉన్నది, అది నిజమైన కళే! తన నాయికానాయకుల కష్టసుఖాలయందు చదువరికి ఆసక్తి కలగచేసే కథకుడు

లేనిపోని కథలు సృష్టించటానికి హక్కును పొందినవాడవుతాడు. అట్లాగే కళాదృష్టికల నటుడు తననటనయందు మనస్సు నమ్మకం (కన్విక్షన్) పుట్టించగలిగితే ఆనటుడు వేషధారణకు అర్హుడవుతాడు. అతడి కళాపటిమ యావత్తూ తనునటించుచున్న పాత్రయందూ, ఆపాత్రయొక్క సుఖదుఃఖాలయందూ ప్రేక్షకుడి హృదయం తగులుకునేటట్టు చెయ్యటంలో ఉంటుంది.

ఏతావాతా నేను సృష్టీకరించదలుచుకున్న దేమంటే వేషధారణకు పూనుకున్నవాడు సరియయిన కళాజ్ఞానమూ కళను ప్రకటించేశక్తీ లేనివాడయినాడో, వెంటనే అతడు వట్టి సిగ్గుమాలినవాడుగానూ, ఆత్మగౌరవం లేనివాడుగానూ పరిణమించటం తప్ప గత్యంతరంలేదు. నటకులలో అంత పరిపూర్ణమైన ఆర్టిస్టులు ఎంతమంది ఉన్నారు? మిగిలినవారి సంగతి ఏమిటి? కళాపోషకులకు కళనుగురించి ఎంతవరకు జ్ఞానసంపత్తిఉంది?

మన కళాపోషకులకు ప్రతి నటుణ్ణీ శ్లాఘించటం ఆచారం. పాపం, అజ్ఞానంవల్ల, అట్లా శ్లాఘించటమే కళాపోషకత్వానికి నిదర్శనమనుకుంటున్నారు వారు. వారట్లా ప్రవర్తించితేనేకాని లోకంకూడా వారిని కళాపోషకులుగా గణించదు. మనంచేసే పనులు మనకన్న అజ్ఞానులు ఆమోదించవలిసినగతి మనకు పట్టినప్పుడు మనం అధోగతిపాలుకాక ఏమవుతాం? ఇంతకన్న తారుమారు ఏముంటుందీ?

ఆత్మగౌరవం పోగొట్టుకోని నటుడు, నా అభిప్రాయంలో, ఏవేషంపడితే ఆవేషం వెయ్యడు, ఏనాటకంపడితే ఆనాటకం ఆడడు, ఆడవేషం వెయ్యడు, సంగీతంతో భావప్రకటన చెయ్యడు సంగీతంపాడినా! నాట్యకళను గురించి నా అభిప్రాయాలు తప్పయి ఉండవచ్చును. కాని కళాదృష్టికలవాడు తన ప్రవర్తనకు కొంతవరకు హద్దుపద్దులు పెట్టుకోవాలని మాత్రం అందరూ అంగీకరించితీరాలి.

నాటకరంగంమీదికి రావటమే ఎంతో ప్రమాదకరమైనపని అనుకుంటే, తెరమీదికి రావటం మరింత ప్రమాదకరం. ఎందుచేతనంటే నటకుడు తన మానాభిమానాలను అనేకమందిచేతుల్లో పెట్టినవాడవుతున్నాడు. సినారియో రాసేవాడు తను నటించే పాత్రను నిర్లక్ష్యంతో చిత్రించిఉండవచ్చును. డైరెక్టరు తనచేత ఏహ్యమైనపనులు చేయించవచ్చును. ఎడిటరు తను నటించినదాన్ని తన చిత్తంవచ్చినట్టు ఎడిట్ చెయ్యవచ్చును. టాకీలో వేషంవెయ్య బూనుకున్నవాడు ఈ ముగ్గురిలో ఎవరిప్రవర్తననూ అరికట్టలేడు. కాగితంమీద సంతకంచెయ్యకపూర్వం వారి మొహాలుకూడా అతనికి తెలియకపోవచ్చును డైరెక్టరూ, సీనారిస్టూ, ఎడిటరూ, వీరిముగ్గురూ అసమాన కళాజ్ఞానంకలవారయితేనేతప్ప ఆత్మగౌరవం కలవాడు తెరమీదికిరాడు.

కొందరు పేరుప్రఖ్యాతులుగల నటులు డబ్బుకోసమో పేరు ప్రతిష్ఠలకోసమో చిత్రాలలో ఎక్కటానికి వప్పుకుని డైరెక్టరు వగయిరాలను అరికట్టి అదుపుచెయ్యచూడటం టాకీ పరిశ్రమకు హానికరం. అంత గొప్పనటులు డైరెక్టరు వగయిరాలమీద ఎంతోభక్తి శ్రద్ధలూ గురీ ఉంటేనేకాని చిత్రాల్లో నటించటానికి రారాదు. 'తారలు' పుచ్చుకునేదానిలో ఎన్నోవంతో గిట్టని డైరెక్టర్లూ తదితరులూ కల మన తెలుగుటాకీ పరిశ్రమ ఏస్థితిలో ఉన్నదో మనం సులభంగా ఊహించగలం.

టాకీలకు కావలిసిన నటులు రెండురకాలు — పాత్రధారులూ, నటకులూను, పాత్రధారులు నటకులు కానవసరంలేదు. కథకు కావలిసిన పాత్రలలో ఎక్కువభాగం పాత్రధారులకే

తగిఉంటై. ఆపాత్రలకు తగినవారినిగాచూసి కాస్టింగ్ డైరెక్టర్ వేషాలిస్తాడు. ఈపాత్రధారులు ఆపాత్రలకు ఆకారస్వరూపాలలో ఆ పాత్రలకు సహజంగా తగిఉంటారు. ఇక ఈ పాత్రధారులు చెయ్యవలిసిందేమంటే నవ్వమన్నప్పుడు వారికి సహజంగా చాతనయినట్టు నవ్వటమూ, ఏడవమన్నప్పుడు వారికి చాతనయినట్టు ఏడవటమూ. ఈపాత్రధారులు తమకు సహజంగా చాతకానిపని ఏదీ చెయ్యనక్కర్లేదు. హాలీవుడ్‌లో పెద్దపెద్ద జీతాలు పుచ్చుకుంటూ ఎంతో పేరుప్రఖ్యాతులు కలవారు చాలామంది కేవలమూ పాత్రధారులే కాని నటకులు కారు. ఇక నటకుడేమంటే, అతను తనసహజ ప్రకృతిని చంపుకుని మరొక మనిషి అయిపోవాలి. అయిపోయి తనూ తను నటించుతున్నపాత్రా ఒకటేనని మనల్నినమ్మించాలి. వారిపాత్రలను సృష్టించేవారూ, వారిని డైరెక్టుచేసేవారూ అ పరబ్రహ్మలై ఉండాలి.

మన ఆంధ్రదేశంలో నటకులున్నారుకాని డైరెక్టర్లు వగయిరాలింకా లేరు. టాకీలు తీసేవారు కొన్ని సూత్రాలు తెలుసుకునేదాకా ఆడైరెక్టర్లు తయారుకారు. ఇప్పటిమట్టుకు జరుగుతున్నదేమంటే మంచినటకులను చెడు డైరెక్టర్లు చెడగొట్టుతూ ఉండటమే. ఆంధ్రుడికి ఏవిషయంలోనూ సూక్ష్మదృష్టి విచక్షణా లేదు. వాడుకభాషలో రాసే చత్తయావత్తూ నవ్యసాహిత్యమే. అట్లాగే తెరమీద ఎక్కేవారంతా నటకులే, ఎక్కువ తక్కువలతో. అందువల్ల జరుగుతున్నదేమిటంటే వేషధారణకుకూడా పనికిరానివారు తారలైనారు. సామాన్య పాత్రధారులుకూడా ప్రేక్షకలోకానికి వారిమీద గల మోజునుబట్టి డబ్బూ పేరుప్రతిష్టలూ సంపాదించటం అసహజంకాదు. కాని ప్రొడ్యూసర్లు నటుల పేరుప్రతిష్టలనుబట్టి నటకులే ధరించవలిసిన వేషాలను పేరు ప్రతిష్టలుగలవారికివ్వటం ఆంధ్రులకే సహజం.

—కొడవటిగంటి కుటుంబరావు.



# చిలకమర్తి లక్ష్మీనృసింహముగారి నాటకములు


రచయిత:

నిడుమర్తి సత్యనారాయణమూర్తి, బి.ఏ.,బి.ఇడి.


ఆధునికాంధ్ర వాఙ్మయమునందు ఉన్నతస్థానము నాక్రమించిన వారిలో శ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహము గారొకరు. వీరు నాటకములను, నవలలను, ప్రహసనములను, కథలను, వ్యాసములను వ్రాసి మెప్పువడసిరి. మృదుపదశోభితమును, అప్రయత్నజనితము నగు వారి శైలియు, ఉత్సాహకరములగు కథాసందర్భములును, నర్మగర్భితములగు సంభాషణములును, ఆనందదాయకమగు హాస్యమును చవిచూచి మెచ్చుకొనిన యాంధ్రుడు లేడని చెప్పవచ్చును. నేడున్న ఆంధ్రకవులలో ప్రజానురాగము నమితముగ జూరగొనిన వారిలో వీరగ్రగణ్యులు. 'జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల' యనునట్లు ఎక్కువగ ప్రేమించి యతి పరిచయము గలిగియుండనే గాబోలును మనవారెవరును పంతులువారి గ్రంథములను విమర్శనదృష్టితో జూచి తమయభిప్రాయముల నాంధ్రలోకమున కెరుకపరుపలేదు.

### రచనము

వీరు నాటకములను వ్రాయుట 1889 లో మొదలిడిరి. ప్రథమమున కీచకవధ వ్రాసిరి. ఆసంవత్సరమే జూలై, ఆగస్టులలో ద్రౌపదీ పరిణయమును; అక్టోబరు నవంబరు నెలలలో గయోపాఖ్యానమును రచించిరి. ఈనాటకమున అర్జున చిత్రరేఖాపాత్రములను దేశసేవచే ప్రఖ్యాతిగాంచుచున్న శ్రీయుత టంగుటూరి ప్రకాశము పంతులుగారభినయించిరి. ఆసంవత్సరాంతమున శ్రీరామజననము గూడ వ్రాయబడెను. మరుచటి వత్సరమున సీతాకల్యాణపారిజాతాపహరణ నలచరిత్రములు వ్రాయబడినవి. మరల కొన్ని వత్సరముల వరకును పంతులుగారు నాటకములను వ్రాయుట మానిరి. 1905 లో 'మనోరమ'ను స్థాపించిరి నెలకొక యంకము చొప్పున సుప్రసిద్ధమగు నరకాసురవధను వ్రాసిరి. ఈనాటకమును కీర్తిశేషులగు ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రులుగారు చూచి తెలుగునుండి సంస్కృతములోని తర్జుమాచేయదగిన నాటకమిది యొకటి మాత్రమేయనుచు దీని ప్రాశస్త్యమును గొనియాడిరి. ఆఖరునాటకమును, మిక్కిలి మంచిదియగు 'చతుర చంద్రహాసము' 1909 లో మొదలుపెట్టబడి చిరకాలము మూలనుబడియుండి చివరకు 1919 లో సమాప్తమయ్యెను. ఈనాటకములలో గయోపాఖ్యానము, పారిజాతాపహరణము, నరకాసురవధ, చతుర చంద్రహాసములు మాత్రము జనాదరణము నెక్కువగ బడయుచున్నవి.

పంతులుగారు నాటకములు వ్రాయుటకు పూర్వమే ఆంధ్రదేశమున నాటకములు కొన్ని ప్రబలియుండినవి. అందు కీర్తిశేషులగు వీరేశలింగముగారివి మొదటివి. తదనంతరము శ్రీయుత వసురాయని వేణీసంహారమును, శ్రీ నుసర్ల అనంతరావుగారి పాండవాజ్ఞాత చరిత్ర

మును, శ్రీనూర్ రామానుజాచార్యులుగారి నాటకములును రంగము నలంకరించినవి. కాని పంతులుగారి నాటకములును అచిర కాలమున వేదికపై ప్రాముఖ్యమును బడసినవి. వారి నాటకములను ప్రదర్శింపఁ జూచుట ఫాషన్ (fashion) అయినది. నాటినుండి నేటి వరకును వారికి గల ప్రచారమమితము. వారి నాటకములలో గయోపాఖ్యాన మొక్కటి యును 75,000 లు ప్రతులమ్ముడి పోయిన వన్నచో పైసంగతి స్పష్టపడగలదు. ఒక మారు తాడేపల్లిగూడెంస్టేషనునుండి ఒంటెద్దుబండినెక్కి వెళ్లుచు పంతులుగారు వాని నేదైన పాడుమనియడుగగా వాడు 'అల్లుడా రమ్మని యాదరమ్మునఁబిల్వఁబంపుమామను బట్టి చంపగలమె' యని మొదలిడినాడు. డంబములేక తనయొద్ద కూర్చున్న జ్ఞాననేత్రుడే ఆపద్యమును వ్రాసిన కవియని వాడు గ్రహింపలేదు. కాని దాని మాధుర్యమునకు వాడు వశుడైనాడు. అట్టివశులైన లక్షలమంది ప్రజలలో వాడొకడు.

మొదట వీరినాటకములలో పద్యములంత గాలేవు. అయిననవి రసపుష్టియందు వెనుకబడి యుండలేదు. ఆసమయమున కోర్టు వ్యవహారముపై రాజమహేంద్రవరము వచ్చిన మద్రాసువాసి రాయబహద్దరు, విద్యావినోది పనప్పాకం ఆనందాచార్యులు (సి. ఐ. ఇ.) గారు ఈనాటకములను జూచి ఆనందించి 'నాటకములకు సంగీతమే ముఖ్యముగాదు. అభినయాదులావశ్యకము. పద్యములతోడను పాటలతోడను నిండిన బళ్లారివారి నాటకములను మెచ్చుకొనినచెన్నపురి నగరవాసులు మీ నాటకముల గూడ మెచ్చుకొందురు. మా పట్టణమునకు మీరు రావలెను' అని వారిని కోరిరి. కాలము గతించిన కొలదిని ప్రేక్షకుల రుచి ననుసరించియు, నటకులగాన విద్యానైపుణ్యము ననుసరించియు పద్యములు,

పద్య గద్యములు

హెచ్చినవి. సంగీతము పెరిగినది. నటకుని యొక్క స్థితిని బట్టియు, భావముయొక్క యవస్థనిబట్టియు పద్యగద్యములు మారవలెనను నియమములేని నేటినాటకరాజములందువలెగాక పంతులుగారు చాలవరకు తమ పద్యములను సమయానుకూలముగ రచించినారు. అక్కడక్కడ విమర్శకు కనవసరములకు స్థలములు గోచరింపవచ్చును. కాని అవి యరుదు.

సరియగు తావున రసవంతముగ పద్యములను వ్రాయుటలో వీరికినేర్పు మెండు. నరకుడు ఇంద్రుని సభాస్థలిని ప్రవేశించుచు

చ॥ తునియలుగాగ కొండలను - ద్రుంచిన దోర్బలశాలి, యయ్యహా! ల్యను వలపించినట్టిరసి-కాగ్రణీ, స్వర్గపురైకనాథుడున్ । కనులొకవేయిదాలిచిజ - గత్తిరియమ్ముగ నిపెట్టునేత । యయ్యనిమిషనాథుడేడి, దను- జాధిపుడాతని జూడగోరెడిన్॥

(నరకాసురవధ ౧ అం.)

అని ఉగ్రమును నర్మమును మిళితముగు విధమున జనువు పద్యమును, సత్యభామాదేవి కోపము నను నయింపుచు

సీ॥ ఉలిదనీకపకార-మొనరించితినయేని
మొలనూలితో నను-మోదరాదె?
తరుణీనీయెడ నేను-తప్పుచేసితి నేని
- పువ్వుబంతులనన్ను రువ్వరాదె?
జలజాక్షి నీయాన-జవదాటితినయేని
కలువతూడులనన్ను-గట్టరావె?
మగువనీపనువేను - మఱచిపోతినయేని
విరిదండ సంకెలల్ - వేయరాదె?
ఎన్నడిట్లు సేయపుగద - యింక ననుచు
గట్టిగా నన్ను చీవాట్లు - పెట్టరాదె?
యింతియేకాని యీరీతి నలిగియలిగి
పలుకకుండి నేనెట్లు - బ్రతుకువాడ?

(పారిజాతాపహరణము ౨ అం. 9 వ)

అని చదివిన కృష్ణుని పద్యమును ఇంపగు

నుదాహరణములు పాత్రములను సందర్భమున నింకను కొన్ని వివరించెదను. ఇవి బంగారు కిరీటమున స్థాపితములగు మణులవంటివి. అర్థముచేసుకొని నటు డభినయించినచో బహురమ్యముగ నుండును.

ఇపుడు నాటకములసంఖ్యాకములుగా తయారగుచున్నవి. వర్షకాలమున బుట్టి స్వల్పకాలమున నశించు చికిలింతవలెనివియును ప్రథమముద్రణమున నడుగంటుచున్నవి. ఏవైననొకటి రెండు మరల ముద్రణాలయమును బ్రవేశించినను దానికికారణము వానియొక్కయుత్కృష్టత కాక చదువరుల యరసికత్వమని నాయభిప్రాయము. ఇట్లువి నశించుటకు గారణము నాటకముల కుండవలసిన యుత్తమలక్షణములు వానియందు లేకుంటయే. (ఈలక్షణములు కేవల సంస్కృత లాక్షణికులు చేసినవని నే నభిప్రాయపడుట లేదు. కాలము మారిన కొలదిని, భావములతిశయించినకొలదిని లక్షణములుకూడవిస్తృతినొందవలెను.) కథాభాగమునందు ప్రేక్షకుల శ్రద్ధను జూరగొన గల చమత్కార ముండదు. ఉన్నను సంభాషణాక్రమము శోచ్యము. ప్రదర్శనోచితమగు చలనము, చురుకుతనము నుండవు. ఈభావమును జ్ఞప్తియందుంచుకొని పంతులుగారి నాటకములను జదివిన వానికింతప్రచారముండుటకు గారణమెరుంగగలము.

వీరి నాటకములకు గథాభాగము పూర్వగ్రంథములం దున్నది. అందుసూక్ష్మముగనున్న కథనుండి యస్థిపంజరమును నిర్మించి తన ప్రతిభావిశేషముచే గవి వానికి సుస్వరూపమును నొసంగెను. కథను గైకొని నపుడు గూపకలక్షణవిలసితములగు విషయముల నెంచి వానిని బాగుగా మననముచేసి వానిని ప్రదర్శనమునకు తయారు చేసెను. ఈవిధమున వీరినాటకములు ప్రతిభాసమన్వితములగు అంకములతోను, రంగములతోను, నిండియున్నవి. నరకాసురవధ యందలి రెండవ యంకమట్లు సుప్రసిద్ధమైనది. తెలుగు నాటకములందట్టిది వేరొండు లేదనుట యతిశయోక్తి కానేరదు.

ఇరువురకు వేదికపై కెక్కించి వినువారికి రుచించునటుల సంభాషణను కల్పించి పెంచుటలో పంతులుగారికి గల శక్తియపారము. శ్రీకృష్ణ నరకుల యొక్కయు, కర్ణార్జునుల యొక్కయు సంవాదనలే యిందుకు దార్కాణము.

పాత్రములు

ఇక పంతులుగారి పాత్రపోషణశక్తిని చూతము. కథను గ్రహించి దానిని ప్రేక్షకుల రుచికనువగువిధమున వెలయజేయుటలో వీరికి ప్రజ్ఞ లెస్సగా గలదు. ఆశక్తియే పాత్ర పోషణమునందును కొంతవరకు గాన్పించుచున్నది. వీరి స్త్రీపాత్రములు నీడలవలె అస్పష్టముగ నుండును. ఒక రిద్దరికి తక్క మిగిలిన వారికి వ్యక్తిత్వము లేదు. కాని పురుషపాత్రములట్లు మాట్లాడ గలరు.

సామ్యము

ఒకవిషయము శ్రీకృష్ణుడు వీరి నాటకముల్లు మూడింటిలో వచ్చును. అందాతని పాత్ర ఎంతవరకు క్రమపద్ధతిని పోషణమునొందినదో చూతము. ప్రపంచ విఖ్యాతివడసిన షేక్స్పియరు ఒకే పాత్రమును రెండు నాటకములందు ప్రవేశపెట్టినాడు. ఒకదానియందున్న గుణములే రెండవదానియందగుపరచి క్రమవికాసమును తనపాత్రములయందు జూపినాడు. అంటోనీ, ఆక్టేవియస్ సీజరు అట్టివారు 'జూలియస్ సీజరు' నందు దిఙ్మాత్రముగ గనుపిం

చిన గుణములే 'ఆంటోనీక్లియోపాత్ర'యందును విస్ఫుటములైనవి. అటువంటిదే ఫాల్‌స్టాఫ్ పాత్రము. ఇక మన్న కృష్ణుని జూతము. ఇతడుభగవంతుడు. కాని పామరునివలె గయుడుమియుట పొరపాటనియైన తలంపక భక్తుడనియైన కనికరించక గయుని జంపనెంచును. తన పంతము నెగ్గవలెనను పట్టుదలచే పార్థుడిచ్చిన మాటను దీసుకొనవలెనని రాయబారమునంపెను. మత్స్యావతారమును జూపగల మహిమాన్వితుడయ్యును గయుని నామము యమునాజలాది దేవతవలన దెలిసికొనెను. ఇందీతని కార్యములు పరస్పర విరుద్ధములు. అసందర్భములు. శ్రీ కృష్ణునిగుణములం దిట్టియసంగతములుండుట పురాణప్రసిద్ధమని సరిపెట్టుకొనవచ్చును. అదియును గాక నాటకచతుష్టయమునం దిదియే ప్రథమము: అందుచే కవియొక్క నిర్మాణ కౌశలము తీవరించియుండక పోవచ్చును. కాని ఇందలి కృష్ణుని పాత్రము కొన్ని మంచిగుణము

కృష్ణుడు

లతో విలసిల్లుచున్నది. 'అదియేయయ్యెము నాతరంగిణి' యని మొదలిడి 'భుజమున చల్దిచిక్కములు' 'మోవినిపిల్లనగ్రోవియు' గల్గి 'కంఠమున గురువిందపేర్లు' చిందులాడ హాయిగ గ్రేపులమేపుచునుప్పట్లాడిన తనబాల్యమును చెంతనున్న వారికి జూపినపుడు మధురతరములగు నాబాలకృష్ణుని చిందులాటల చిరుగంటలధ్వనులలో చైతన్యము లీనముగాని ప్రేక్షకుడెవడు?

ఇతడు నరకుని కాలమునకు ముదిరినాడు. భాగవతమునందలి దశమస్కంధ పూర్వభాగమున మెరపువలె మెరసి రసమువలెపారి తన లలిత క్రియలచే వ్రజాంగనల వలపులగొనిన వేణుగానప్రియు డితడుగాడు. వ్యాపారము గలిగి పట్టణమున త్వరజీవనమును గడుపు లౌకికుడు. తెలిసియుండియు తెలియనటులనటించువాడు. తనయాధిక్యము నెఱింగినవాడు ప్రౌఢుడు. వైరులయొక్క గుణాగుణములను సమగ్రముగ లెక్కింపగల నిష్పాక్షికుడు. అందుచేతనే నరకునిగూర్చి

'ఆ తేజంబున కాబలంబునకు తో-డై నీతియేయుండెనా! నీతంద్రడంతటివాడు ముజ్జగములన్ లేడు'

అని భగదత్తునితో నుడివెను.

ఒకరుచేసిన పనులందు తప్పొప్పులు విమర్శించి దుష్టశిక్షణమును శిష్ట రక్షణమును జేయు ధర్మదాతయగు కృష్ణుడు పారిజాతాపహరణమునకై బయలుదేరినాడు. వయసు ముదిరిన కొలదిని ఇతని రసికత యతిశయించినది. భార్యలపోరాటములుతీర్చి వారి మనసులను హరించు శక్తికూడ తీవరించినది. కాని పారిజాతము నతడు నిస్సంకోచముగ హరించుట జూడ

'బలవంతుల్ బలహీనులన్ బొదివిచంపంజూతురేకాని పాకలదే ధర్మపదానువర్తనము'

అను గయుని విలాపము నిజముకాదాయని తోచును. కృష్ణునకుకూడ నది తగనికార్యమని తెలియకపోలేదు. చింతామణి, అమృతభాండము, కల్పభూరుహము మొదలగునవి యెల్లను దానే యింద్రున కిచ్చుటజేసి యాపారిజాతమును హరించుట కొంతవరకు పాడియని సరిపెట్టుకొనెను. ఈ కృష్ణునియందింకొకలోపము కూడగలదు. పతివ్రతా తిలకమగు రుక్మిణి తాను మిగిలిన స్త్రీలయిండ్లకు బోవుటచే నలిగినదని తలంచును. పాప మాతని చరిత్రమతిదీనమైనది. ఇతనికి సంసారసౌఖ్యమునున్న. ఒక స్త్రీ సంతసించిన పదునారువేల యేడుగురు దుఃఖించి బాధించెదరు. కాని రుక్మిణి—పతివ్రతా తిలకమగు రుక్మిణి—

యౌవన మదగర్వితయగు సత్యవోలె నాధుని చెయదములకై యీసుంబూనుట లాఘవము కాదా ?

నరకుడు

పంతులుగారు నిర్మించిన ఉత్తమపాత్రములలో నరకుడొకడు. ఇతడనిన నాయన కభిమానము మెండుగనున్నట్టు కాన్పించుచున్నది. దిక్చక్రమున దృశ్యమై యనతికాలమున నంతకంతకు పెద్దదిగ గాన్పించి యాశ్చర్యమును గొలిపి మరల చిటికలో నదృశ్యమగు ధూమశకటమును బోలినది యితనిపాత్రము. ఇతడు దృఢకాయుడు, మేఘగంభీరభీషణంబులగు భాషణంబులు గలవాడు. పూర్వోదాహృతమగు 'తునియలుగాఁగ' అనుపద్యమును చదువుచు వేదికపైకి వచ్చినపుడాతని కంచుకంఠమును బాహుబల సంపదయును మన యభిమానమును జూరగొనును.

నరకుడు భూదేవికిని కృష్ణునకును జన్మించిన సంతానము. తన తపఃప్రభావముచే పరమేష్ఠిని మెప్పించి వరము లనేకములు బడసి యథేచ్ఛగ విహరించెను. రాక్షసుడని కేవలము పశుప్రాయుడుగాడు. అతని మేధాసంపద యపూర్వమైనది. మహేంద్రునితో నతడుచేసిన ప్రసంగమే యిందుకు దార్కాణము.

మ. అపరాధంబులు గల్గె మావలనఁ జండారాతి సైన్యాటవీ। తపనోద్యద్దహనాయమానపటుదోర్దర్ప ప్రతాపాఢ్యు ని। న్నిపుడీరీతిని చూడవచ్చితిని నేని న్నాళ్లురాకుంటకున్। గృపతోడన్ క్షమియింపు తమ్ముడఁగదా యెంతైనదేవేశ్వరా! (నరకా ౧ అం.)

యనియు

ఉ. ఎన్నఁడులేనికూర్మియిది యెన్నటినుండి జనించెనయ్య నీ। కిన్నరకుండు దేవవిభుఁ డెక్కడుపీఠము నెక్కువాఁడె నీ। వన్నను నేనొనర్పగలనా యది......కన్నులువేయి తాల్చిన గోతమునింటను వోడిగావలెన్॥ (నరకా. ౧ అం.)

యనియు నాతని దెప్ప మొదలినపుడు అవమానభరమున గ్రుంగియున్న మహేంద్రుని మనోవ్యథ యాతనికే యెరుక.

ఇతడు రసికశేఖరుడు. ఊర్వశిపై నెంతయో వలపుగొనినాడు. సేనాధిపతులను బంచి వెదకించినాడు. కదనోద్ధూతబిడౌజుడగు నీ రాక్షసరాజు మదనుకోలలకు వెన్నవలె గరగి పోయినాడు. ఆవిరహతాపముచే నాతని యాలోచన తీవరించి కవితాలహరిగా ప్రవహించినది. ఉదయించిన పున్నమచంద్రునిచూచి

గీ. కలసి వేల్పులు భుజియించు కంచమనగ
చంద్రబింబంబు వెలుగొందె, చదలనదిగో
సురలుతినువేళ కంచము, చుట్టుబడిన
మెతుకులట్టులు చుక్కలు, మెరయుచుండె.
(నరకాసురవధ)

యని పాడినాడు.

సీ. ఈవెన్నెలలవేల్పు-టెల నాగతోడి స
య్యాటలేకాని యే-యాటలొల్ల

ననుచు తనమోహాముయొక్క తీవ్రతను జూపినాడు. అట్టి సమయమున 'బంగారపు బొమ్మవోలె' నూర్వశి ప్రవేశించెను. చేజిక్కినది కదాయని యతడు తుచ్ఛముగ, ప్రవర్తింపక తనరసికత నామెకు ప్రకటపరచ యత్నించెను. తన యభిమతసూచకమగు మాటలలో

మ. త్రిజగన్మోహనమై, దివాభరణమై,- దేవేంద్రునిక్షేపమై। యజనిర్మాణముకన్న ప్రౌఢతరమై- యామన్మథోద్యజ్జయధ్వజమై, కన్నుల పండువై లలితమై- ద్రష్టవ్యమైయొప్పు అక్కజమా నీ నెర జవ్వనంబలరుతం గల్యాణి! యెల్లప్పుడున్.

అని దీవించినాడు. ఆ టక్కులాడి యంతకును దన్నురావించిన కార్యము తెలియ దనినపుడు,

గీ. ఇంచువిలు కోదునన్నది - యేమొకాని
యేచుచున్నాడు నెనరొక - యింతలేక

మరునితో జెప్పి యాపీడ - మాన్పగదవె
మరుడు వినకున్న నీ వైన - మాన్పతగవె ?

యని పలికినాడు. కాని యామె చలింప లేదు. తనకును ఇంద్రునకును రసికతయందు గల భేదము చూడవచ్చుననినాడు. ఆమె య నుమానించుటచే ప్రాతరంకులు బయటకు దెచ్చి దెప్పినాడు. ఇవన్నియు నిష్ప్రయోజన ములగుచున్నపుడు 'దనుజులము మేము మాకేల ధర్మమేల?' యని తన తుది నిశ్చయమును ప్రకటించెను, కాని '......చిత్తమెల్లం జెడి యున్న రిత్తయొడలం బనికూరునె ......' యని యెంచువాడగుటచే ఆమె హావిర్భాగ ములను గోరగనే యొప్పుకొని యామెకు బో వననుజ్ఞనిచ్చెను.

సత్యభామతోనతడు చేసిన ప్రసంగము కూడనతని బుద్ధికుశలతతో నిండియున్నది. నరకు డోటమినొందియుంటచే నుచితానుచి తంబు లెరుంగక మాటలాడునని కృష్ణు డెంచెను. కాని యతడు మాత్రము సత్యతో దురుసుమాటలు రానీకమాటాడెను. ఇతడు తేజశ్శాలి. ఇతని ముందు ఇంద్రుడును ఉపేంద్రుడునుకూడ నిస్తేజులై కాన్పించెదరు. ఇరువురును రంగమందున్నపుడు నరకుడు కృష్ణుని కన్న వేయుమడుంగు లధికముగ జూపట్టును. ఆశ్చర్యమొదవును. చూచినకొలదిని నరకుని బాహు బలమును తెలివి తేటలును తీక్ష్ణమై కాన్పించును. అత డనేకసంగరరంగవిజయోల్లాసి. తృణీకృత పురందరాది దిక్పాలుడు. వైరవీరుల చెరకుగట్టల యట్లు నరకగల శాత్రవంతుడు.

కాని సమయము వచ్చినపట్ల నిర్దయుడు. కార్యనిశ్చయముగలవాడు. మునులు హావిర్భాగములీయ నిరాకరింతురని విని అగ్నికీల వలెలేచి 'చెలగి యిచ్చవచ్చిన రీతి జేయవచ్చు' 'అచటి కెవడు వచ్చునో చూతు నడ్డగింప' ననుచు సైనికుల కాజ్ఞ ఇచ్చెను.

నరకుడు క్రూరుడైన కావచ్చును. కాని మేధాశాలి. ఆకాంతి యాతనిగుణముల కొక క్రొత్త విన్నాణము నొసంగుచున్నది. వయసు నందు యౌవనమువీడి కౌమారమును ప్రవేశించుచున్నటులున్నాడు. ఆతని శక్తులన్నియు పరిపూర్ణమగు వికాసము నందియున్నవి. ఆ వికాసము మారకమునుపే అకాలమరణము వాతబడెను. మరణమునందుగూడనతడు ప్రకాశవంతుడై యున్నాడు.

చతుర చంద్రహాసము

పాత్రల మనోవృత్తులను సంపూర్ణముగ చర్చించు నాటకము 'చతుర చంద్రహాసము' దుష్టబుద్ధియొక్క 'స్వతగము'లతని మనస్సును ప్రతిబింబింపజేయు దర్పణములు. షేక్స్పియరుయొక్క 'లియరు' మోస్తరుదిది. ప్రదర్శనమునకంత అనువైనదికాదు. కాని చదివినకొలదిని గంభీరముగా నుండును. దుష్టబుద్ధియొక్క భావపరంపరలును, ఆశాపిశాచములును 'సినిమా' బొమ్మలవలె మనోనేత్రాంగణమునగదలును వినోదకరములై యున్నవి. పాత్రలయొక్క మానసికవృత్తులను స్పష్టముగ చర్చించెడి తెనుగు నాటక మిది యొక్కటియే.

దుష్టబుద్ధి

ఈనాటకమునందలి ప్రధానపాత్రము. కుంతలదేశాధీశుని మంత్రియగు భాగురాయణుడు షష్ఠిహాయనవత్సర సంపన్నుడు. పురుషకారమునం దత్యంత విశ్వాసముకలవాడు. అట్టివారికి ఉండవలసిన సమయస్ఫూర్తి, దృఢనిశ్చయము నితనియందు సంపూర్ణముగ గలవు. ఈవిషయమున నితడు మూడవ రిఛార్డు, మాక్బెత్తులను పోలును. తలంచిన కార్య

సాఫల్యమునకు వలయు కార్యములను మంచి చెడ్డల వ్యత్యాసములేకుండ చేయగలవారు. వీరు రాజ్యాశచే పురిగొల్పబడిరి. మకీంమగారి శవమువెంట నరుగుచున్న యువతినిసమీపించి వలపుపలుకులాడి తన్ను వివాహమాడ నామె నొడబరచినవాడు రిఛార్డు. తనయింటికి విందారగింపవచ్చిన రేనిజంపినయామె మాక్బెత్తు. ఇక దుష్టబుద్ధియన్ననో,

తే. నామనోరథంబు-నవరత్నమకుటంబు
నా చిరాభిలాష-రాచరికము
నాదు రమ్యభూమి-వర నాయకునిగద్దె
నాకు మోక్షపదము-లోకజయము.

(చ. చం. 1 అం. 6 ప)

అనిచాటినాడు. కాని వారివలె రేనిసమయింప నితడు చూడలేదు. దీనికికారణము ఆతని సద్బుద్ధికాదు. దూరదృష్టిమాత్రమే.

'చ. చంపుదు నా నృపాలకుని - చంపితి నా
ప్రజపైపదీపనిన్'

అనితలచి యారకొని రాజుతో వియ్యమంది కుమారుని కుంతలరాజ్యమున కధికారి జేయ నిశ్చయించెను.

ఏతత్కార్యసాఫల్యమున కితడు
'చెప్ప దగుకార్యమొకటి చేసినదిలేదు
నింద్యమగు కార్యమొకటి మానినదిలేదు.'

చక్రవర్తి లక్షణలక్షితుడని జ్యోతిష్కులు పలికిన పిల్లవానినిజంప నడవులకుబంపెను. రాజకుమారిని వలచివచ్చినవారి కామె జాతకము మంచిదికాదని చెప్పి మరలించిపంపెను. మాళవేంద్రు నెడ స్నేహమునటించి బంధించెను. ఆతనికుమారుని జంపబంపెను. కాని యాతనికార్యములు విపరీతఫలము లొసంగెను. ఆతనిప్రయత్నము లిసుకలోని బొమ్మరిండ్లవలె నొక్కుమ్మడి కూలెను. ఆ యాశాభంగమును సైపజాలక ఆత్మహత్య చేసుకొనెను.

కొన్నివిషయములందీతనిచెయ్దములు పిశాచకృత్యములను దలిపించును. స్వీయ కార్యోపయోగమునకై ఉగ్రసేనుని నియోగించినవిషయ మిట్టిది. ఉగ్రసేనుడు సేనాని. బలముగలవాడు. మంత్రికుమార్తెయగు విషయను వలచినవాడు. తనయొక్క దుష్కార్యారంభమున కుగ్రసేనునిసాయ మవసరమగుటచే విషయయొక్క సమ్మతిలేకయే ఆమె నాతనికీయ నిశ్చయించుకొని,

మ. ధరణీమండల మండనాయితమహోద్యత్కుంతలక్ష్మాధురం। ధరభాగ్యం బొనగూడుకాలమిదె ప్రాప్తంబయ్యెనద్దాని ముం। దర నీబాలిక సౌఖ్యమెంత? మరిమోదంబెంత నేనిత్తు రా। జ్యరమాదేవికి పుత్రికాసుఖబలిన్ సంకల్ప మీడేరగన్ ॥

(చ. చం. 2 అం)

అని వజ్రతుల్యమగు తనహృదయరహస్యమును బయలుపరచెను. అటుతరువాత ఆమెను చంద్రహాసుడు వివాహమాడెనని అతడు వినినపుడు క్రోధముచే నిండిపోయెను. చంద్రహాసుని చంపుటకు క్రూరశీలములగు భూతబేతాళపిశాచములను స్మరించెను. వివాహమై మూన్నాళ్ళయిన గాకమునుపే కుమార్తె విధవ కావలసివచ్చునని యైన నతడు దుఃఖించలేదు.

'తీవ్రదుఃఖసంజనితమనోవ్రణములు
మానుచుండును కాలక్రమంబుచేత'

'మానుగాక. మానకపోవుగాక. ఆమె నిమిత్తమై నా ప్రారంభమును మానుకొందునా? భర్తృవియోగదుఃఖమున నీమె మృతినొందునేమొ? మృతినొందిననేమి? ఏమైన రోగము వచ్చి యీమె యిప్పుడు మృనొందినచో నేమిచేయుదును?' అని పిశాచార్థము

లగు పలుకులతో సరిపెట్టుకొనెను.

అంతటి క్రూరుడైనను, అవినీతిపరుడైనను, దుష్క్రియారంభుడైనను ఈతనియం దొక మంచిగుణమున్నది. కుమారునియందు అతనికి ప్రేమమెండు. ఎందరెందరి రక్తమునో ప్రవహింపజేసి అనేకులసుఖమును హరించి యతడు రాజ్యసంపాదనము చేయనెంచుట కుమారుడగు మదనునికొరకే. కాని యతడు,

'మంటిలో నుద్భవించెడు మణులలాగు
ఖలులకడుపున నుత్తముల్ గలుగుచుంద్రు'

అనుసామెతను నిజమనిపించినాడు. చంద్రహాసుని జంపవలసిన హంతకులు పొరబడి యితనినిచంపుదురు. మదనుని చావును, చంద్రహాసుని పట్టాభిషేకమును భాగురాయణుని దుఃఖమున ముంచును. దానినోర్వక నాత్మహత్య చేసుకొనెను.

తమయాశలను నెరవేర్చుకొనుటకై ప్రపంచకమునందలి యితరులసౌఖ్యములను లెక్కచేయనివారిలో నితడొకడు. పర్వత శిఖరమునుండి జారిన పెద్దబండ దూర మధిగమించిన కొలదిని వేగమును తీవరింపజేయుచు త్రోవలో నడ్డువచ్చినవానిని నాశనము చేయుచు చివరకు పెద్దధ్వనితో పర్వతమునకు మొదటబడి తుత్తునియలగుగతిని దుష్టబుద్ధియొక్క కార్యములు రక్తమును అసౌఖ్యమును ఇచ్చవచ్చినరీతి వెదజల్లి యాతని నశింపజేసెను.

### స్త్రీలు

పంతులుగారికి ఆంధ్రస్కాటు అను బిరుదము వాడుకయందున్నది. వారినవలలు స్కాట్టునవలలవలె రంజకముగను ఉద్రేకముగను నుండును. స్కాట్టుయొక్క గుణములతోపాటు అతనియందలి లోపముగూడ నొకటి పంతులుగారికి ఉన్నది. ఇరువురి స్త్రీపాత్రములును ఛాయామాత్రములై వ్యక్తిత్వ విహీనములై యున్నవి. పురుషపాత్రములందున్న విస్పష్టత క్రమ వికాసము ప్రజ్ఞాదులు స్త్రీలయందు గోచరమగుటలేదు.

### రుక్మిణీ సత్యభామలు

రుక్మిణీ సత్యభామలు పురాణప్రసిద్ధలగు స్త్రీలు. రుక్మిణి లక్ష్మియొక్క యంశాసంభూతురాలు. పరమపతివ్రతాతిలకము. కావుననే ఆమె చేతినుండి జారిన తులసీదళము జగత్పితయగు కృష్ణునికంటె భారమైతూగినది. సత్య, యౌవనవతియగు రాకుమారి; అభిమానవతి, ఈర్ష్యాపరవశ. ఇరువురకును తారతమ్యమెంతేని యున్నది. కాని పారిజాతాపహరణమున నిరువురును ధూర్తులై ప్రవర్తించిరి. ఆయంకము వేదికపై రసవంతముగ నుండవచ్చును. విమర్శకునిరుచికిసరిపోదు. రుక్మిణియొక్క యుత్తమగుణములకు కళంకము నాపాదించుచున్నది, రుక్మిణి వినయసంపన్న. భర్తయెడ నిర్మలమగు ప్రేమగలది. ఆమెకూడ సత్యవలె నాధునిపై నలుగుట సమంజసము కాదు. కష్టముతోచినచొప్పున నాధునకు వినయపూర్వకముగ నివేదించెడి వివేకవతి. సత్యయొక్క గుణపోషణము బాగుగానున్నది. ఉత్తమకులసంభూత యైసిరితోగూడి యందచందములనొప్పారు అభిమానవతుల కుండవలసిన ఈ సుగర్వము, త్రుళ్లిపాటు, ధిక్కారము, నీమెయందు మూర్తీభవించియున్నవి. కోరినకోరిక నెరవేర్పవలెనను పట్టుదలగలది.

### ఊర్వశి

లక్ష్మీనరసింహముగారు చిత్రించినస్త్రీలలో నూర్వశిమేటి. ఈమెతో మనకు స్వల్పకాలపరిచయముమాత్రము కలదు. దానివలన నీమెగడుసరియని తోచుచున్నది. ఈమె 'యొప్పులగని' 'బంగారపుబొమ్మ.' రసికులగా*

కాకున్న ఇంద్రుడట్టి ముజ్జగంబులదొర కేలు మోడ్చి దేవసంతతో విధేయుడగునా? నరకుని దయవలన నీమెయొక్క పూర్వచారిత్రము మనకించుక తెలిసినది. దేవేంద్రుని యుంపుడుకత్తె. అతనినే ప్రాణేశునిగా భావించినను ఇతరులపై వలపుచిలుకకపోలేదు. మధ్యమ పాండవునిపై మదినిలిపినది. పురూరవుని పొందుగాంచినది. మిక్కిలి చతురమతి. నరకుని యుక్తులకు పైయుక్తులు పన్నినది. మాయా వియగుటచే చివరకు మోసగించి యతనికి ముప్పుదెచ్చిపోయినది. నరకాసురవధలో ద్వితీయాంకమున మెరపువలె మెరసినది. కాని యా కాంతి తేజము సులభముగా మరువదగినవి కావు.

### హాస్యము

ఈనాటకముల గుణమననమున నింకొక యంశము మాత్రము మిగిలినది. అది వాని యందుగల హాస్యము. స్థలసంకోచమున దానిని దిఙ్మాత్రముగ నుదహరించెదను నాటకములందు హాస్యము రెండువిధముల నుపయోగపడును. పామరులను రంజించుట, దుఃఖము కరుణ, క్రోధము మొదలగురసముల తీవ్రతను, భారమును దగ్గించుట. ఉత్తమనాటకములం దీరెండును నిపుణముగ కూర్పబడి యుండును. ఉదాహరణమునకై నరకాసురవధనుగైకొందము. ప్రథమాంకమున నరకబాధితుడై యింద్రుడు దుఃఖముతో వెడలిపోవును. మునులను ఇచ్చవచ్చినరీతిని బాధింపవచ్చునని నరకు డానతిచ్చును. ఈరెండును గూడ ప్రేక్షకులకు కష్టముగనుండును. అట్టి సమయమున మందపాల వజ్రకంఠులు వత్తురు. 'పంది బురదమెచ్చునుగాని పన్నీరు మెచ్చునా' యనునట్లు నీచవాసనలుగల మందపాలునకు స్వర్గము రసవిహీనమైచూపట్టును. వాని దేవులాటయెదుట మృగరాజునొద్దనుండు జంబుకంబు తీరుగల వజ్రకంఠుని మాయాలాపములు చాల హృదయంగమముగ నుండును. పంతులుగారి హాస్యమతీవలలితమనుట సుప్రసిద్ధము. కథను గల్పించునెడల ప్రజ్ఞయే కథతో హాస్యమును సరసముగ మిళితముచేయు నెడలను గలదు.

### లోపములు

చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారి నాటకములు నిర్దోషములుకావు ప్రథమప్రయత్నములందుండు దోసములు కొన్ని వాని యందున్నవి. కొన్నిపాత్రములు బాగుగా పోషింపబడినను కొన్ని నీరసముగా నున్నవి. చాలభాగములందు కథ రమ్యముగ నున్నను క్లిష్టత (Complication) లేదు. వారి నవలలందున్నరీతిని ముఖ్యమగుకథయందు లీనమగుచిన్న కథలులేవు. కాని వానియందుగల గుణములు చాల ప్రశస్తమైనవి. ప్రథమప్రయత్నములం దట్టిప్రజ్ఞావిశేషము లరుదుగానుండును. నరకుడు, దుష్టబుద్ధి, మందపాలుడు

### ముగింపు

మొదలగువారు ఆంధ్రభాష యున్నంతకాలము నిలుచువారు. కాలముగాని, పరిచయముగాని వానియందలి క్రొత్తదనమును, విన్నాణమును రద్దుచేయజాలవు. ఇవి తెనుగు నాటకములకు ప్రపంచసారస్వతమున స్థానము నిప్పించుటకు తగినప్రభకలవి కావు. కాని అట్టి నాటకములను రచింపగల కవులకు మార్గము నుజూపు విద్యుద్దీపము లివి. అంత తేజోయుతములగు గ్రంథములు నాటకయుగారంభమున వెల్వడుట సామాన్యవిషయముకాదు.

# అనుభవ వైద్యాని అమృత సూక్తులు

పొట్లకాయలో వెండిలోహం నిండారివుంది.

... ... ...

పరగడుపున నీళ్లుతాగితే పసరు పెరుగుతుంది.

... ... ...

గోచీ ముందునుంచి వెనక్కి గాక వెనకనుంచి ముందుకు పెట్టడం మంచిది.

... ... ...

పాదాలు ఎంతతరుచుగా కడుగుతూవుంటే కళ్లకు అంతమంచిది.

... ... ...

దంతాల వెంబడి నెత్తురుకారుతూవుండేవారు వేడినీళ్ళతో పుక్కిలిపట్టకూడదు.

... ... ...

చెవిలో తైలంవేసుకుంటే అరికాళ్ళకు చాలా మంచిది.

... ... ...

సుఖోష్ణంగా కాచిననీళ్లల్లో స్నానంచెయ్యాలి కాని బాగామరిగిననీళ్లల్లో చన్నీళ్లుపోసి తోరిపి పోసుకోవడం ఆరోగ్యప్రదంకాదు.

... ... ...

తలమీద మిక్కిలి వేడినీళ్లు పోసుకుంటే నేత్రాలకి సెబ్బరి. వెంట్రుకలకి బలంతగ్గుతుంది.

... ... ...

తడిగుడ్డధరించడం రోగాన్ని ఆహ్వానించడమే.

... ... ...

స్నానంచేత కలిగిన శీతగుణాన్ని పోగొట్టడానికి విభూతిధారణం మంచి సమర్థమైంది.

... ... ...

నెయ్యి అభిఘరించిన మెతుకులు భోజనాదియందు తినడంవల్ల అంతవరకు కడుపులో ప్రకోపించిఉండే వాయువు శాంతిపొందుతుంది.

... ... ...

తమలపాకులు వేసుకోవడంవల్ల పట్టే తిక్కకు నీళ్ళతో పుక్కిలించి నోట్లో పుల్లనివస్తువు కాని తియ్యని వస్తువుకాని చప్పరించాలి

... ... ...

నారింజ, బత్తాయి మొదలయిన పండ్లరసం పిండి తాగినదానికంటె తొనలు చప్పరించి రసము మింగడం మంచిది.

... ... ...

రోజుకు రెండుసారుల భోజనం ఉత్తమపద్ధతి. భోజనానికి భోజనానికి 7 గంటలు తక్కువ కాని కాలవ్యత్యాసంవుండాలి.

... ... ...

ప్రతిరోజు కొంతసేపేనా సంగీతంవినడం మంచి ఆరోగ్యం కలిగిస్తుంది.

... ... ...

వళ్లుకాలడంచేత కాని మరిదేనిచేత కాని చర్మంలో నాలుగింట మూడుభాగాలుపోతే ఇక ఆమనిషి జీవించడు.

... ... ...

అరటిపళ్లు, పాలుమంచి పుష్టికరమైన ఆహారం.

... ... ...

మూడు నెలల బిడ్డకు దినానికి కనీసం అరవైగంటల కాలమేనా నిద్రవుండాలి.

... ... ...

సూర్యకిరణాల్లో అమోఘమైన క్రిమిసంహారక శక్తివుంది.

... ... ..

బచ్చలికూరలో ఇనుము ఉంది.

... ... ...

బట్టతలరోగం కలగడానికి కారణాల్లో తలకి నిత్యమూ చమురురాసుకోకపోవడం ఒకటి.

... ... ...

వేసవికాలంలో మధ్యాహ్న భోజనం అయిన తరవాత పండ్లనుకూడా తినకూడదు. వేసవిలో మధ్యాహ్నము దాటినకొద్దీ జీర్ణశక్తి తగ్గిపోతుంది.

Printed at The Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.

శ్రీ కృష్ణుని జీవితమునందలి రసవత్తరఘట్టము నొకదానిని

నాట్యకళాభిజ్ఞుల నేర్చికూర్చి సాంకేతికప్రవీణులసహాకారముతో

బొంబాయిలోని ప్రసిద్ధ స్టూడియోలో

తెలుగు, అరవము, కన్నడము

## మూడు భాషలలో

శాస్త్రపరిపక్వముతో తయారు చేయబడుచున్నది.

ఒకేకథను మూడుభాషలలో వ్యాపారకళాదృష్టులతో చక్కగా తీయుటకు

హిందూదేశమున ఇదే ప్రథమప్రయత్నము.

## లక్ష్మీ సినీటోను (లిమిటెడ్)

**146**, బ్రాడ్వే, మదరాసు.